## సదాశివ సమారంభాం


గురు దక్షిణామూర్తి


గురు వేదవ్యాస మహర్షి


గురు శుక మహర్షి


గురు నారద మహర్షి


గురు వాల్మీకి మహర్షి


గురు శ్రీకృష్ణ

## శంకరాచార్య మధ్యమాం


గురు దత్తాత్రేయ


గురు బాబాజీ


గురు గౌతమ బుద్ధ


గురు ఆదిశంకరాచార్య


గురు రామానుజాచార్యులు


గురు జ్ఞానేశ్వర్


గురు రవిదాస్


గురు కబీర్ దాస్


గురు చైతన్య మహా ప్రభువు


గురు నానక్


గురు రాఘవేంద్ర స్వామి


గురు వీరబ్రహ్మేంద్ర స్వామి


యోగి వేమన

## అస్మదాచార్య పర్యంతాం


గురు త్రైలింగ స్వామి


గురు లాహిరి మహాశయ



గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి


గురు వివేకానంద


గురు సాయి బాబా


గురు అరబిందో


గురు రమణ మహర్షి


గురు యోగానంద


గురు భక్తివేదాంత ప్రభుపాద


గురు మళయాళస్వామి


గురు విద్యాప్రకాశానందగిరి


గురు చంద్రశేఖర పరమాచార్య

## వందే గురుపరంపరాం..




## భారత ప్రభుత్వపు వెబ్ సైట్ - డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా

## http://www.new.dli.ernet.in

Digital Library of India: Inc ×

www.new.dli.ernet.in

# Digital Library of India

Hosted by: Indian Institute of Science, Bangalore in co-operation with
CMU, IIIT-H, NSF, ERNET and MCIT for the Govt. of India and 21 major participating centres.

Home | Vision | Mission | Goals | Benefits | Content Selection | Current Status | People | Funding | Copyright Policy | FAQ | RFP

Books Journals Newspapers
Palm-Leaves (Manuscripts)

Title: Ramayanam
Author:
Year: to
Subject: Any Subject
Language: Telugu
Scanning Centre: Any Centre
Clear | Search

Presentations and Report
Statistics Report
Status Report
Feedback | Suggestions | Problems | Missing links or Books

Click here for PDF collection
DLI MIRROR at IUCAA Data Center PUNE

DLI

For the first time in history, the Digital Library of India is digitizing all the significant works of Mankind.

Click Here to know More about DLI New!

| Books | Journals | Newspapers | Manuscripts |
|---|---|---|---|
| Rashtrapati Bhavan<br>CMU-Books<br>Sanskrit<br>TTD,Tirupathi<br>Kerala Sahitya Akademi | INSA | Times of India<br>Indian Express<br>The Hindu<br>Deccan Herald<br>Eenadu<br>Vaartha | Tamil Heritage Foundation<br>AnnaUniversity NEW! |

**Title Beginning with.**

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

**Author's Last Name**

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

**Year**

| 1850-1900 | 1901-1910 | 1911-1920 | 1921-1930 | 1931-1940 | 1941-1950 | 1951- |
|---|---|---|---|---|---|---|

**Subject**

| Astrophysics | Biology | Chemistry | Education | Law | Mathematics | Mythology | Religion | For more subjects... |
|---|---|---|---|---|---|---|---|---|

**Language**

| Sanskrit | English | Bengali | Hindi | Kannada | Marathi | Tamil | Telugu | Urdu |
|---|---|---|---|---|---|---|---|---|

# అతి విశిష్టం ఈ దానం!

స్వామి వివేకానంద

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.



రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, జవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

# పదహారు రాత్రులు

రచన :

'బులుసు వెంకటరమణయ్య'



: ప్రకాశకులు :

బుక్‌మన్స్ : : మదరాసు - 7



# పదహారు రాత్రులు

అనగనగనగా ఒక దేశం. ఆ దేశం పేరేమిటోగాని యిప్పుడు జ్ఞాపకంలేదు. పోనీండి. ఆ దేశాన్ని ఒక రాజు పాలించుతూ ఉండేవాడు. ఆయన పేరు హేమప్రభుడు.

హేమప్రభునికి రెండువిధాలయిన శక్తులు ఉండేవి-ఒకటి సేనాబలం, రెండవది ప్రతిభాబలమున్నూ. ఆయన సేనలు ధైర్యసాహసాలకూ, పరాక్రమానికీ పేరుపడ్డవి. అందువల్ల, సముద్రపర్యంతమూ వుండే భూభాగమంతా ఆయన జయింప గలిగాడు. బుద్ధిబలంలో ఆయనను మించినవారే లేరు. ఇక, సమస్త శాస్త్రాలూ, సకలవిధములైన కళలూ హేమప్రభునికి కరతలామలకములే అయిఉండేవి.

ఉండేవి. అయితే, సర్వసమర్థుడైన ఇటువంటి రాజుకు తెలియనిది ఒక్కటే ఒక్క విషయం ఉన్నది—అదే స్త్రీలను ప్రేమించడం.

రాజు గొప్ప అందగాడు. గొప్ప ప్రతాపశాలి. ఆయనను చూచిన ఎంతటి అందకత్తెఅయినా ఆయనను ప్రేమించే తీరుతుంది. అయితేనేం?- ఆ రాజుకుమాత్రం ప్రేమించడం తెలియదు. తెలియకపోతే పోనీ. ఆడువారిని ద్వేషిస్తాడుకూడాను. అటువంటప్పుడు ఆయనను ప్రేమించిన ఆడుది నిరాశ చెంది క్రుంగి పోవలిసిందేకద!

స్త్రీజాతిపైన ఉండే ప్రబల ద్వేషంచేతనే హేమప్రభుడు పెళ్లిచేసికోకుండా ఉండిపోయాడు. రాజ్యమేలే రాజు పెళ్లాడక పోతే ఎట్లా? రాజుకు వారసుడే ఉండవద్దా? ఆయన తదనంతరం రాజ్యాంగం నిర్వహించటానికి సంతతి కలగవద్దా? లేకుంటే రాజ్యం అరాచకమై పోదా?—ఈ సమస్య మంత్రుల నందరినీ కలవర పెట్టసాగింది. ఈ ఆలోచనతో వారికి దిగులు ఎక్కువయింది.

అందరూ చేరి కూడబలుక్కున్నారు. లోకోత్తర సౌందర్యం గల అందకత్తెలు ఎక్కడెక్కడ ఉన్నారో, వెతికి వెతికి తెప్పించి, రాజు కళ్లయెదుట పడేటట్టు చేశారు. అయినా, మనస్సు మారలేదు. ఆయన అణుమాత్రమూ చలించలేదు.

'ఏమిటీ విడ్డూరం! ప్రభువులు వనితల వలలో పడకూడదనే మాట సబబుగానే వుంది. కాని, వివాహమే మానాలని యెక్కడుంది? జగములనే కదిలించివేయగల అప్సరసలు ఎదట వచ్చి తాండవమాడుతూవుంటే, ఈ రాజు వాళ్లని కన్నెత్తి చూడనైనా చూడడే! ఇక ఏమిటి సాధనం?' అని మంత్రులు వారి తెన్నూ తెలియక కూర్చున్నారు.

ఒకటి రెండుసారులు వారు ధైర్యంచేసి రాజుఎదుట పడ్డారు. ప్రభువు పెళ్లిచేసికోకుంటే రాజ్యాంగంలో సంభవింపబోయే చిక్కులన్నీ విప్పిచెప్పారు. ఏమి చెప్పినా, ఎంత చెప్పినా, ఈ విషయంలో మట్టుకు వారు ఆయన మనస్సును తిప్పలేకపోయారు.

చివరకు మంత్రులు బాగా యోచించి, మరొక గట్టి ఉపాయం చేశారు. అది యేమిటంటే—'రాజు మనస్సు మార్చి, వివాహంమీద రక్తి కలిగేటట్టు చేయగలవాళ్లకు

ఒక లక్ష మొహిదీలు బహుమతి ఇస్తామని ఆయనకూ తెలియ జేస్తూ చారులమూలంగా రాజ్యమంతటా ప్రకటన చేశారు.

ప్రకటన విని ఎంతోమంది వచ్చారు. మంత్రాలు వేశారు. తంత్రాలు చేశారు. వేటివల్లా లాభం లేకపోయింది.

లాభం లేకపోవటం సరేగదా, రాజుకు గల నారీద్వేషం హెచ్చుపెరగసాగింది. అది ఎంతవరకు పోయిందంటే—స్త్రీ కంటబడితే చాలు, ఆ కంటబడిన స్త్రీని రాజ్యంనుంచి వెళ్లగొట్ట డమే శిక్షగా వేస్తూవచ్చాడు! ఎంత విపరీతం!!—ఈ పరిస్థితి మంత్రులలో చాలా కంగారు పుట్టించింది. రాజుకంట పడ కుండా, రాజ్యంలో స్త్రీలను ఎలా రక్షించటమా అనేది వారికి ఒక పెద్ద సమస్య ఐంది.

ఏ సమయాన రాజు ఎటు వెళ్లేదీ తెలుసుకునేందుకు ప్రత్యేకించి చారులను ఏర్పరిచారు. వారివల్ల సమాచారం తెలుసుకొని, ఆ సమాచారాన్ని ప్రజకు తెలిపేవారు. రాజు వచ్చే మార్గంలో స్త్రీలు కనపడకుండా తప్పుకొనిపోయేటట్టు చేస్తూ వచ్చారు. నిజానికి, ఈ పని మంత్రులకు కత్తిమీద నడకే అయింది.

ఇలా ఉంటూవుండగా- ఆ పట్టణానికి ఒక చిత్రకారుడు వచ్చాడు. ఆతడు పేదరాసి పెద్దమ్మ యింటిలో బసపెట్టాడు. ఊళ్లో విశేషాలేమిటో చెప్పుమని పెద్దమ్మను అడిగాడు. అప్పు డామె ఇలా చెప్పింది—

'నాయనా!- ఏమిటని చెప్పమంటావు. ఈ దేశాన్ని పాలించే ప్రభువే ఒక గొప్ప విశేషమై వున్నాడు! మా మహా రాజు హేమప్రభుడు గొప్ప రాజుమాత్రమే కాదు, గొప్ప

[illegible] స్త్రీల [illegible] ంచటంలో ఆ మహారాజుకి [illegible] మాట. అయితేనేం!—[illegible] పని, [illegible]. [illegible] తన కంట పడకూడదని ఆజ్ఞ చేశాడు. ఎందుకో మరి, ఇంత ద్వేషం? [illegible]

ఈ మాటలు విని చిత్రకారుడు చిరునవ్వు నవ్వాడు. 'ఇదా సంగతి, మిత్రమా! నీకు తెలుసునో లేదో, నాదగ్గర ఒక గొప్ప మంత్రం ఉన్నది. సూర్యకాంత మాణిక్యంమీద సూర్యుడూ, చంద్రకాంత శిలమీద చంద్రుడూ ఎలా పని చేస్తారో, మీ రాజు విషయంలో నా మంత్రం అంత బాగా పనిచేస్తుంది' అని చెప్పాడు.

చిత్రకారుడిదగ్గర మంత్రమున్నసంగతి చారులమూలంగా మంత్రులకు వెంటనే తెలిసిపోయింది. వారు తక్షణమే చిత్రకారునికి వర్తమానం పంపి రప్పించారు. రాజు విషయమంతా వివరించి చెప్పారు. రాజు మనసు మార్చి, ఆయనను వివాహానికి సుముఖంగా చేస్తే, ఇంత బహుమతి యిస్తాము అని తెలియజేశారు.

అందుకు చిత్రకారుడు 'సరే, మీ రాజు నన్ను పిలిపించటానికి తగిన ఏర్పాటు చేయండి. తరవాత పని యావత్తూ నాకు విడిచిపెట్టండి' అని చెప్పాడు.

అప్పుడు మంత్రులు హేమప్రభునివద్దకు వెళ్లి ఇలా మనవి చేశారు: 'మహాప్రభూ! మన వూరికి ఒక గొప్ప చిత్రకారుడు వచ్చిఉన్నాడు. బొమ్మలు వేయటంలో అతనికి ఉన్న శక్తి వర్ణించటానికి అలవికాదు. అతని కతడే సాటి.

మూడు లోకాలలోనూ అతడు అసమానుడు, అజేయుడున్నూ. సెలవయితే, ఏలిక యెదటికి అతనిని రప్పించగల' మన్నారు.

మహారాజు సమస్త కళలలోనూ ఆరితేరినవాడు. అందులోనూ చిత్రకళ అంటే చెవికోసుకుంటాడు! అందుచేత, మంత్రులు చెప్పిన మాటలు వినగానే, ఆ చిత్రకారుణ్ణి రప్పించ టానికి అనుమతి యిచ్చాడు.

అల్లంత దూరాన్నించే రాజును చూశాడు, చిత్ర కారుడు. చూచి, హేమప్రభుని అతిలోక సౌందర్యానికి ఆశ్చర్య పడినాడు. ప్రభువును సమీపించి, సాష్టాంగనమస్కారం చేసి నిలబడి, చేతులు రెండూ జోడించి, ఇలా విన్నవించుకొన్నాడు:

'ప్రభూ!—ఏలిక దర్శనంచేసుకోవటానికి అనుమతి దయ చేయించటమే నా జన్మ సార్థకమైనట్టు భావిస్తున్నాను. భూలోక మందు గల మానవ సౌందర్యాలలో నేను చూడనిది లేదు. కాని, దేవరవారి సౌందర్యంవంటి లోకోత్తర సౌందర్యం ఇంత వరకు నే కని విని ఎరుగను. అనుగ్రహిస్తే, ప్రభువువారి చిత్రాన్ని వ్రాసికొని, ఆ చిత్రాన్ని ఎల్లప్పుడూ దగ్గర ఉంచు కొని పూజించుకోవాలని అభిలాషగా ఉన్న' దన్నాడు.

రాజు సంతోషించాడు. 'ఓయీ చిత్రకారుడా!—నీ ప్రజ్ఞనుగురించి మా మంత్రులు చెప్పగా విన్నాము. మా పటము నీవు వ్రాసికోటానికి అనుమతించే ముందు నీ నేర్పు ఎటువంటిదో మేము స్వయంగా తెలుసుకోవాలి. కాబట్టి ఇది వరకు నీవు వ్రాసిఉన్నవాటిలో మచ్చుచిత్రాలు కొన్ని మాకు చూపించు' అన్నాడు.

వెంటనే, చిత్రకారుడు ఇదివరకు తయారైవున్న

బొమ్మల పుస్తకం తియ్యబోయాడు.

అంతలో మళ్లీ హేమప్రభుడు, "చిత్రకారుడా!— ఒక్క సంగతి మాత్రం నీవు జ్ఞాపకం ఉంచుకోవాలి. పేటినైనా నాకు చూపించవచ్చు గాని, స్త్రీల బొమ్మలున్నట్టు కంటబడినయ్యో, తల కొట్టించి కోటగుమ్మానికి కట్టించుతాము సుమా!" అని గద్దించి పలికాడు.

మహారాజు ఇలా అంటాడని చిత్రకారునికి తెలియనే తెలుసు. తెలిసివుండిన్నీ, ఏమీ తెలియనట్టుగా రకరకాల చిత్రాలను హేమప్రభునికి వరసగా చూపించ నారంభించాడు. ప్రపంచంలో గల అనేక దేశాలకు సంబంధించిన రకరకాల చిత్రాలను ఎంతో శ్రద్ధగా చూస్తున్నాడు మహారాజు. చూస్తూ చూస్తూ, ఒకదగ్గరకు వచ్చేసరికి, హేమప్రభుడు మూర్ఛ పోయాడు.

అప్పుడు చిత్రకారుడు మంత్రులను చూచి 'రాజుగారి జబ్బు నయమయింది. నాకు యిస్తానన్న వైద్యకట్నం తెప్పించండి!' అన్నాడు, నవ్వుతూ.

'అదేమిటయ్యా, ప్రభువులు మూర్ఛపోయివుంటే జబ్బు నయమయిం దంటావేమిటి? నీమాట ఎలా నమ్మటం?' అని అడిగారు మంత్రులు.

మంత్రులు వేసిన ప్రశ్నకు చిత్రకారుడు ఇలా చెప్పాడు: "మీకే బోధపడుతుంది. ఆయనకు తెలివివచ్చిన తరువాత, నే నిక్కడ లేకపోవడం చూసి, మహారాజు ఏమనేదీ గమనించండి. నేను మాత్రం ఇప్పుడు ఇక్కడ వుండకూడదు" అని అంటూ, అతను వెళ్లిపోయాడు.

వెంటనే మంత్రులు సేవకులను పిలిపించారు. వారందరూ ప్రభువుకు శీతలోపచారాలు చేశారు. ప్రభువు తెలివిలో పడగానే "ఏడీ! ఏడీ!! ఆ చిత్రకారు డేడీ?" అని ఆత్రంతో మంత్రుల నడిగాడు.

చిత్రకారుడు వెళ్ళిపోయినట్టు చెప్పేసరికి, రాజు రౌద్ర మూర్తి అయ్యాడు. "వెళ్ళిపోయాడా? ఎలా వెళ్ళిపోతాడో చూస్తాగా! ఉన్నవాడిని ఉన్నట్టుగా పట్టితెచ్చారో సరేసరి. లేకపోతే ఒక్కొక్కళ్ళని ఏనుగులచేత మట్టించివేస్తా, జాగర్త!!" అని గద్దించి పలకడంతోనే మంత్రులందరూ గడగడలాడి పోయారు. వెంటనే పోయి, ఎక్కడనో వున్న చిత్రకారుని వెతికిపట్టి, రాజు యెదటికి తెచ్చి నిలిపారు.

కంపించిపోతున్న చిత్రకారుడు రాజు పాదాలపై పడి నాడు. "ప్రభూ!- క్షమించాలి, అపరాధం వచ్చింది. ఏలిక కిచ్చిన పుస్తకంలో ఆ స్త్రీపటం మధ్యని యిరికివున్న సంగతి నాకు తెలియనే తెలియదు. ప్రభువులు అంతగా హెచ్చరించి నప్పటికీ, ఆ పటం వాటి మధ్య వుండిపోవటం కేవలం నా దుర దృష్టం గాక మరేమిటి?" అని కళ్ళనీళ్ళతో దీనంగా చెప్పు కొన్నాడు.

అప్పుడు ప్రసన్నభావంతో వున్న హేమప్రభుడు చిత్ర కారునితో ఇలా చెప్పాడు: "మిత్రమా!- భయపడకు. జగన్మో హనాకారం గల ఆ యువతి చిత్రం చూపి నాకు నీవు మహోప కారం చేసినవాడవైనావు. ఆ పటం నీపుస్తకంలో పొరపాటునే ఇరికి వుండవచ్చు. ఆ పొరపాటే నాపట్ల వరప్రసాదమయింది. నిజానికి, స్త్రీలంటే నాకు ఎంతమాత్రమూ కిట్టదు. అటువంటి

నాకే ఈ పటం చూడటంతో మనస్సు పారిపోయింది. ఆమె ఏ రాజపుత్రిక అయివుంటుందో వెంటనే చెప్పు. ఇలాంటి సౌందర్య చిత్రణ సృష్టికర్త అయిన ఆ బ్రహ్మకు తప్ప మరొకరికి సాధ్యం కానేకాదు. నీవు ఆ బ్రహ్మదేవుడిలా తెలివున్న మొనగాడి వనటానికి సందేహంలేదు. మూడు కాలాలలోనూ నీవంటి చిత్రకారుడింకొకడు ఉండబోడని నా నమ్మకం.”

అందుకు చిత్రకారుడు: “ప్రభూ!_ నామనవి చిత్తగించండి. ఈ చిత్రంలో వున్న అమ్మాయిని గురించి ఏలిక పూర్తిగా మరిచిపోవాలని నాకోరిక. లేకపోతే, నా అజాగ్రత్త వల్ల జరిగిన పొరపాటు ఫలితంగా దేవరకు గొప్ప విపత్తు కలగబోతుందని నాకు భయంగా వుంది” అని వినయంగా జవాబిచ్చాడు.

మహారాజు ఊరుకోలేదు. “చిత్రకారుడా!_ మా మాటకు ఎదురు చెప్పవద్దు. ఆ యువతి ఎవరో చెప్పావా నీవు కోరుకొన్న ధనధాన్యాలలో, ఐశ్వర్యంలో ముంచి తేలుస్తాను. చెప్పకపోతే సంకెళ్ళు వేయించి ఘోరమైన చెరలో పడవేయిస్తా. రెండింటిలో ఏది ఇష్టమో ఆలోచించుకో” అని చెప్పాడు.

ఇలా అనేసరికి చిత్రకారుడు భయపడుతూ: “మహారాజా !_ నేను ఇలా మనవిచేసింది ఏలినవారి మేలుకోసమే. ఆ యువతిని గురించి వివరాలు చెప్పడంవల్ల ప్రభువులకు కష్టాలు కలగక తప్పదు. అందుకోసమే ఆ అమ్మాయిని గురించి పూర్తిగా మరిచిపోవలసిందని నేను ప్రభువులను మరీ మరీ కోరివున్నాను. కాదు, కూడదు - చెప్పితీరాలి అని ప్రభువులు

శాసించటంవల్ల తప్పక చెప్పవలసే వస్తున్నది. ఆ చిత్రపట ములో వున్న యువతి నాగరాజు సోదరుని పుత్రిక అయిన 'చంద్రకళ' అనే పేరుగల చిన్నది'' అని చెప్పి ఊరుకున్నాడు.

అప్పుడు హేమప్రభుడు చంద్రకళ చరిత్ర ఇంకా చెప్ప మని ఆత్రంతో అడిగేసరికి చిత్రకారుడు మళ్లీ ఇలా చెప్పాడు:

''ఆ చిన్నది ఇప్పుడు ఒకానొక అరణ్యంలో ప్రత్యే కించి ఒక దివ్యభవనం నిర్మించుకొని తన పరిజనంతో కూడా అందులో నివసిస్తూ వున్నది. ఆ భవనం చేరడానికి ఇక్కడి నుండి రెండునెలలు ప్రయాణం చేయవలసి వుంటుంది. చంద్ర కళ అతిలోక సౌందర్యవతి. ఆమె నిజసౌందర్యాన్ని ఏచిత్ర కారుడూ చిత్రించలేడు. ఆమె చక్కదనంలోని సహస్రాంశ మైనా, నేను చిత్రించిన ఈ చిత్తరువులో కానరాదు. అయి నప్పటికీ పటము చూచినంతనే ఏమి జరిగేదీ ఏలికకు అనుభవ వేద్యము అయ్యేవున్నదికదా!- అటువంటప్పుడు ఆమె నిజ రూపమే చూడటం తటస్థించిన యువకులు ఆ అతిలోక సౌంద ర్యానికి ముగ్ధులై మూర్ఛపోవటంలో ఆశ్చర్యమేమున్నది?- మూర్ఛనుండి తేరుకోలేక మరణించినవారూ కొందరున్నారు'' అని మళ్లీ ఊరుకున్నాడు చిత్రకారుడు.

ఆసక్తితో వింటున్న హేమప్రభువు అలానే కూర్చుండి పోయాడు. ఇది గమనించి చిత్రకారుడు ఇంకా ఇలా చెప్పాడు:

''రాజా!- చంద్రకళ రూపంలో ఎంత సౌందర్య మున్నదో, ఆమె హృదయంలో అంత కాఠిన్యమున్నది. ఎంతటి అందగాడు వచ్చినా ఆమె హృదయాన్ని ఆకర్షించనే లేక పోయాడు. ఇంతెందుకూ, ఆమెకు ప్రేమ అంకురింప చేయ

షంలో మన్మథుడి బాణాలు ఐదూ కుంటుపడిపోయినై. చంద్ర కళను చేపట్టవలెననే కోరికతో ఎంతోమంది సుందరులైన రాజకుమారులు దేశదేశాలనుండిన్నీ వచ్చేవారు. ఆమె కొంత అలక్ష్యభావంతో ఉండీకూడా వచ్చినవారిని గౌరవ మర్యాద లతో చూచేది," అని చెప్పి కొంచెం ఆగాడు.

తరువాత ఏమి జరిగిందో తెలుసుకోవాలనే కుతూ హలంతో, రాజు చిత్రకారునివైపు ప్రశ్నార్థకంగా చూచాడు. అప్పుడు చిత్రకారుడు మళ్లీ చెప్పసాగాడు:

"ప్రభూ!- చంద్రకళ తనను వివాహం చేసికొనవచ్చిన వారి విషయమై ఎంత చక్కటి యేర్పాటులు చేసిందను కొన్నారు! అతిథులకు, సమస్త సదుపాయాలూ అమర్చిన విడిదెలు. ఆ విడిదెలలో పదహారు రోజులు ఉండాలి. ఆమెకు వారు రోజుకొక సమస్య చొప్పున ఇవ్వాలి. ఆ సమ స్యలకు ఆమె సమాధానం చెప్పుకోవాలి. చెప్పుకోలేకపోతే, ఆమె ఓడిపోయినట్టు. కనుక, సమస్య లిచ్చిన యువకుణ్ని ఆమె పెళ్లాడి తీరవలసిందే. ఒకవేళ చెప్పుకో గలుగుతుందా, ఆమెకు తగిన సమస్యలను వారు ఇవ్వలేదన్నమాట. కనుక, ఆ యిచ్చినవాడు ఓడిపోయినట్టు. ఇలా ఓడిపోయినవాళ్ళు ఆమెకు దాసులు కావలిసిందే. ఇటువంటి దాసుల్ని ఎలా చూడటమా అనేది ఆమె యిష్టంలో వుంటుంది" అని చెప్పాడు.

హేమప్రభువు ఒక్కసారి నిట్టూర్చి, 'తరువాత?' అని ప్రశ్నించాడు. చిత్రకారుడు అందుకొన్నాడు:

"చంద్రకళను పెళ్లాడటమంటే ఇటువంటి కఠినపరీక్ష లతో కూడుకొన్న పని అని తెలిసికూడా, చాలామంది సిద్ధపడి

వచ్చారు. కాని, యింతవరకూ నెగ్గి బయటపడినవాళ్ళు ఒక్కళ్లూ లేరు. చంద్రకళ అసామాన్య. సమస్త శాస్త్రాల లోనూ ఆరితేరిన దిట్ట. ప్రతిభావంతురాలు. ఓడిపోయినవారిలో కొంతమందిని ఆమె ఇళ్ళకు వెళ్లిపొమ్మన్నది. కొంతమందిని తన సేవకోసం నియమించుకొన్నది. అనుక్షణమూ ఆమె దివ్యసుందరరూపం కళ్ల బడుతూ వుండటంచేత, సేవకులుగా ఉంటున్న ఆ రాజకుమారులకు మరీ కష్టమనిపించేది. వాళ్ల స్థితి పశువులకంటే హీనమని వేరే చెప్పాలెనా? సంగతి సందర్భాలు ఇలా ఉండబట్టే, ఆమెనుగురించి మరచిపొమ్మని ప్రార్థిస్తున్నాను. ఏలికమాత్రం ఇటువంటి ఆపదలో చిక్కుకోరని ఎవరు చెప్పగలరు? ఈవిషయంలో నాకు దిగులుగా ఉండటంచేతనే మనసు విడిచి మనవిచేశాను. తరువాత దేవర చిత్తం" అని చెప్పి ముగించాడు, చిత్రకారుడు.

చిత్రకారుడు చెప్పిన యీ వృత్తాంతం విని హేమ ప్రభుడు పకపక నవ్వాడు. "ఓయీ మిత్రమా!- నీవు చిత్రకళలో చూపిన ప్రజ్ఞ అసమానమైనది. కాని, నువు చెప్పే మాటలు మట్టుకు అందుకు తగినట్టుగా లేవు. ఒక వస్తువును పొందగలమనే నిశ్చయమూ, ధైర్యమూ ఉన్నప్పుడు, లేనిపోని భీతాపాలు పెట్టుకొని ఆ ప్రయత్నం మానివేయడంకంటె విచారించతగ్గ సంగతి మరొకటి ఉండదు. నా స్థితి ఎంత దయనీయమైనదన్నా కానీ, ఆ లోకోత్తర సౌందర్యాన్ని అనుభవించటానికి తగివున్న ఈ తరుణాన్ని మాత్రం జారవిడువను" అని అంటూ, తన మనోనిశ్చితం వెల్లడించాడు.

అటుతరువాత, హేమప్రభుడు చంద్రకళ పటం తీసుకొని

ఆ చిత్రకారునికి మూడుకోట్ల మొహిరీలు బహుమాన మిచ్చాడు. తన రూపపటాన్ని చిత్రించుకొనిచ్చాడు. చిత్ర కారుడు వెళ్ళగానే, మంత్రులను పిలిపించి, తాను ఆ రాత్రే ఆ చంద్రకళాదేవికోసం ప్రయాణ మవుతున్నట్లు తెలిపి, తగిన యేర్పాటులు చేయుమని చెప్పాడు.

చంద్రకళాదేవి వృత్తాంతం తెలియడంతోనే మంత్రు లందరూ మళ్లీ ఆలోచనలో పడ్డారు. ఇప్పుడు వారికి రెండు విధాలయిన చిక్కులు స్పష్టంగా కనిపించినై : 'ఒకవేళ మహా రాజు తన ఉద్యమంలో కృతకృత్యుడు కాలేక తిరిగి రాకపోతే, రాజ్యం అరాచకం కావటం నిశ్చయం. లేదా, ఇక్కడనే వుండి, స్త్రీలను ద్వేషిస్తూ, సంతతి పడయకపోయినా, అరా చకం సంభవించే తీరుతుంది. రెండు పద్ధతులూ ఒకే విధంగా ఉన్నాయి. అయినా, రెండింటిలోనూ మొదటి పద్ధతే కొంత నయంగా కనిపిస్తున్నది. ఏమీ అంటే, అదృష్టముండి మహా రాజు కోరిక సఫలంకావచ్చునేమో!' ఇలా చర్చించుకుని, మంత్రులు ప్రభువు ప్రయాణానికి తగిన సన్నాహాలు చేశారు.

చంద్రకళపై కలిగిన గాఢానురాగం హృదయాన్ని దహించివేస్తూండగా, మంత్రులకు రాజ్యం వప్పగించి, హేమ ప్రభుడు ఆ రాత్రే బయలుదేరాడు. తోడుగా హేమప్రభుడు తనతో చంద్రకళపటాన్ని మాత్రం తీసుకువెళ్లదలిచాడు. వేరెవ్వరూ తనవెంట రానక్కరలేదన్నాడు.

మహారాజు చేసికొన్న ఈ నిశ్చయం తెలియటంతోనే, ఆయనకు అంతరంగికుడైన ధీనిధి 'నేనూ వస్తా' నన్నాడు. అప్పుడు రాజు "మిత్రమా!- నేను నా ప్రయత్నంలో కృత

కృత్యుడను కావచ్చు, కాకపోవచ్చు. తిరిగి రావచ్చు, రాలేక పోవచ్చు. ఇది మృత్యువుతో పోరాటం. నాతోపాటు మరి కొందరిని వెంటబెట్టుకొని వెళ్లి, చిక్కులపాలు చేయటం ఏమంత భావ్యం ?" అన్నాడు.

అందుకు ధీనిధి ఇలా అన్నాడు : "రాజా !- నన్ను నీవు తీసుకొనివెళ్లకపోతే, నిన్ను నీవే విడిచిపెట్టి వెళుతున్నట్టు అవుతున్నది. ఎలా అంటావేమో - నీలో నేను సగభాగం కదా ! తక్కిన నీ సగభాగమున్ను రాజకుమారిమీదికి పోయి వున్నది. ఇప్పుడు నీకు ఆమె ధ్యాస తప్ప మరొక ధ్యానం లేదాయిరి. ఇటువంటి స్థితిలో, శూన్యహృదయంతో వెళ్లి నీవామెను జయించేదెలా ? నేను నీతో వస్తే, నాలో వున్న నీ అర్ధభాగమూ నీకోసమే ఉపయోగించవచ్చు. ఈ కార్యంలో నిన్ను విడిచి నే నిక్కడ ఉండిపోవటంవల్ల నీకూ ప్రయోజనం లేదు, నాకూ ప్రయోజనం లేదు. మరొక విషయం : ఒకవేళ నీకు అపజయమే కలిగి, తిరిగి రాకపోవటమే తటస్థించినట్టయితే, నే నిక్కడ బ్రతికివుండీ ప్రయోజనమేమిటి ? దేవుడు మేలుచేసి, విజయమే పొందావనుకో. ప్రాణమిత్రుడు పక్కన లేకుండా, అనుభవించే సౌఖ్యంలో ఏమంత స్వారస్య ముంటుంది !"

ధీనిధి ఇలా చెప్పేసరికి, హేమప్రభుడు కాదనలేక పోయాడు. తనవెంట అతను బయలుదేరటానికి వెంటనే అను మతించాడు.

ఏ పని చేయబూనుకొన్నా ముందు గణపతిపూజ చేసే రాజు, ఆనాడు తొందరపాటులో మరచిపోయాడు. ధీనిధి హెచ్చరించి, మిత్రునిచేత గణపతిపూజ చేయించాడు. గణపతి

దేవుడు తన భక్తులకు ఎలాంటి విఘ్నాలూ రానీయడనీ, వారి కోరికలు తప్పక నెరవేరుస్తాడనీ నమ్మకం. ఈ నమ్మకతో వారు, గణపతిపూజ అయినతరువాత బయలుదేరారు. రాత్రనక పగలనక ప్రయాణంచేసి, భయంకరమైన ఘోరారణ్యాలు దాటుకొని, ఒకనాటి మధ్యాహ్ననికి ఒక కదంబవృక్షం చేరుకొని, విశ్రాంతికోసం ఆ చెట్టునీడని కూర్చున్నారు.

హేమప్రభుడు తదేక దృష్టితో చంద్రకళ చిత్రాన్నే చూస్తూ చాలాసేపుండి, తరువాత ఫణినిధివేపు చూశాడు. "మిత్రమా !- ఇది ఒక స్త్రీచిత్రంకదా ! స్త్రీలను గురించే తెలియని నాకు స్త్రీస్వభావాన్ని గురించి ఏమి తెలుస్తుంది ?" అన్నాడు.

అందుకు ఫణినిధి "ఇది చాలా చిక్కుప్రశ్న. నిజానికి, ఇది రాజకుమారినే అడిగి జవాబు తెలుసుకోవాల్సిన ప్రశ్న," అన్నాడు, నవ్వుతూ. అంతతో వూరుకోకుండా, యిలా ఒక కథ చెప్పాడు :

"రాజా !- స్త్రీ అంటే యేమిటనుకొంటున్నావు ? అది ఒక ప్రళయ భయంకరమైన స్వరూపం. విచిత్రవస్తువు లెన్నో రాశిగా పోసి, తయారుచేసిన స్వరూపమది. ఆ స్వరూపం ఎలా తయారయిందో చెబుతా విను :

ఆదిలో సృష్టికర్త వివిధవస్తువులనూ సృష్టిచేస్తూ, స్త్రీలను సృష్టి చెయ్యడానికికూడా పూనుకొన్నాడు. కాని తన సాధన సామగ్రి అంతా పురుషుని-సృజించడంలోనే ఖర్చయి పోవడంచేత స్త్రీసృష్టికి తగిన వస్తుసామగ్రి మిగలకుండా పోయింది. తర్వాత అతను ధ్యానంలో మునిగి, బాగా ఆలో

చించాడు. అతనికి ఒక చక్కటి ఉపాయం తట్టింది. అంతటితో స్త్రీ సృష్టి ఎలా చేయటమా అనే సమస్య తీరిపోయింది. సృష్టికర్త స్త్రీని సృజించడానికిగాను—చంద్రుని గుండ్రతనాన్నీ, తీగల వంకరతనాన్నీ, లతల కుటిలత్వాన్నీ, గడ్డికి వుండే కంపమునూ, రెల్లుకు గల దుర్బలత్వమునూ, పుష్పముల వికాసమునూ, ఆకుల తేలికదనాన్నీ, ఏనుగుతొండపు గరుకుతనమునూ, లేడి బెదురుచూపులనీ, తుమ్మెదలకు గల మూకగా ఉండే గుణాన్నీ, సూర్యకిరణాల ప్రకాశాన్నీ, మేఘాల బాష్పవర్షణమునూ, వాయువుకు గల చంచలతనూ, జింక చెందే భీతినీ, నెమలికి వుండే అహంకారమునూ, చిలుక హృదయంలోని మెత్తదనమునూ, పులికి ఉండే క్రూరత్వమునూ, అగ్నినుండి వచ్చే జ్వాలనూ, మంచు వల్ల కలిగే చల్లదనమునూ, పాలపిట్టల అస్పష్టధ్వనినీ, కోకిల మధురధ్వనినీ, కొంగచేసే వంచననూ, చక్రవాకముల విశ్వాసమునూ—వీటినన్నిటినీ ఒక్కచోట చేర్చి కూర్చి, స్త్రీరూపం తయారుచేసి పురుషుడికి అప్పగించాడు.

ఒక వారంరోజులు గడిచాక పురుషుడు సృష్టికర్త దగ్గరకు వచ్చి "స్వామీ!- మీరు అనుగ్రహించిన వ్యక్తితో పడలేకుండా వున్నాను. ఆమె యెప్పుడూ యేదో గొణుగుతూనే వుంటుంది. ఆమె పెట్టే బాధను సహించలేకుండా వున్నాను. నన్నామె స్వేచ్ఛగా ఉండనీయదు. ఎప్పుడూ ఆమె అడుగులకు మడుగులొత్తుతూ వుండడంతోనే నాకాలం గడచిపోతోంది. ఆమె తీరికగా ఊరికే కూచుంటుంది. ఆమెమూలంగా నా జీవితం దుర్భరమైపోతున్నది. దయచేసి మీరు ప్రసాదించిన

ఆ స్త్రీ వ్యక్తిని మీరాకే తీసుకోండి" అన్నాడు.

'సరే' అని చెప్పి సృష్టికర్త ఆమెను తనదగ్గరకె రప్పించుకున్నాడు.

మరొక వారంరోజులు పోయాక పురుషుడు మళ్ళా బ్రహ్మదగ్గరకి వచ్చి "దేవా!- నా స్త్రీవ్యక్తిని మళ్ళా నాకు అనుగ్రహించు. ఆమె లేని నా జీవితం ఒంటరిగా, దుర్భరంగా వున్నది. ఆమె బరిపే క్రీగంటి చూపులూ, నడిచే నడకా, తీయని కంఠస్వరమూ మరప్పునకు రాకుండా వున్నాయి. వాటి ఆకర్షణ ఇటువంటిదీ అని నోటిమాటలతో చెప్పలేకుండా వున్నాను. ఆమె నాతోకూడా ఆడుతుంది, పాడుతుంది. అతి చమత్కారంగా మాట్లాడుతుంది. క్షణమైనా విడువకుండా, నన్ను సంతోషాంబుధిలో ఓలలాడిస్తుంది. ఆమె మృదుస్పర్శ- అహా!, దానికి సాటిఅయిన వస్తువు మరి లోకంలో లేనే లేదు. ఆమె శరీర సౌందర్యం, ఇప్పటికింకా నాకు కన్నులకు కట్టినట్టున్నది. ఆమె లేని జీవితం నాకు దుస్సహం. కనుక, ఆమెను దయచేసి తిరుగా ప్రసాదించు"మని ప్రార్థేయపడ్డాడు.

ప్రజాపతి కనికరించి, మళ్ళా స్త్రీవ్యక్తిని పురుషునికి ఇచ్చివేశాడు.

మరి మూడురోజులు పోయాక పురుషుడు మళ్ళీ వెళ్ళాడు బ్రహ్మవద్దకు. "స్వామీ!- ఇదంతా నాకు అయోమయంగా కనబడుతూవుంది. ఏమయితే కానీ, నీ విచ్చిన స్త్రీవ్యక్తిని నీకు ఇచ్చివేయటానికే చివరికి నిశ్చయం చేసుకొన్నాను. ఆమె దగ్గర ఉండడంవల్ల కలిగే సుఖాలనూ కష్టాలనూ విడదీసి, త్రాసులో వేసీ, తూచిచూచాను. చూడగా, ఆమెవల్ల పొందతగిన

సుఖాలకంటె కష్టాలే ఎక్కువగా వున్నట్టు తెలుసుకొన్నాను. మరొకలాగున భావించక, నీ విచ్చిన స్త్రీవ్యక్తిని దయచేసి నీవే తిరిగీ తీసుకో'' అన్నాడు.

అప్పుడు బ్రహ్మ ''ఓయీ చపలబుద్ధీ!- ఇక మళ్లీ ఆమెను నేను తీసికోవడం సాధ్యంకాదు. ఏలాగో ఒకలాగున నీవు ఆమెతో కాపరం చేసేతీరాలి'' అని శాసించేసరికి, పురుషుడు ''మరి, ఆమెతో వుండటం నాకు సాధ్యంకాలేదే?'' అన్నాడు.

అందుకు సృష్టికర్త ''ఓయీ, పిచ్చివాడా!- ఆమెను విడిచి ఉండడంమాత్రం నీకు సాధ్యమా? మారుమాటాడకు. వెళ్లిపో'' అంటూ సలహా యిచ్చి సాగనంపాడు.

ఏమి చేయటానికీ పురుషునికి తోచలేదు. 'అబ్బా!- ఏమిటీ చిత్రమయిన స్త్రీవ్యక్తి! ఆమెతో వుండడమూ కష్టమే! ఆమెను విడవడమూ కష్టమే!!' అనుకొంటూ వెళ్లిపోయాడు.''

ఇలా చెప్పి, ధీనిధి రాజు ముఖంవైపు చూచాడు. హేమప్రభుడు కొంచెంసేపు ఆలోచించినట్టుండి, మారుచెప్పక, తదేక దృష్టితో చంద్రకళ చిత్రాన్ని చూస్తూ కూర్చున్నాడు.

ఇద్దరూ యీవిధంగా కొన్నాళ్లు అరణ్యమార్గాలుపట్టి ప్రయాణంచేసి, చివరకు కష్టపడి ఎలాగో, రాజకుమారి చంద్రకళ ఉండేటటువంటి దివ్యభవనం సమీపించారు.



# మొదటి రాత్రి

—1—

దూరంనుంచే వారికి చెట్లలోనుంచి, రాజకుమారి ఉండే ఆ భవనపు గోపురాలు కనిపించాయి. ఉదయభానుని కిరణాలు పైని పడడంతో, అవి బంగారు మయమైనట్లు మిలమిల ప్రకాశించినై. వాటిని చూడగానే హేమప్రభునికి గుండెలలో రాయి పడినట్టయింది.

"ధీనిధీ!_ రాత్రనక పగలనక నేను ఎల్లప్పుడూ ఆ చిత్రాన్ని చూస్తూ, చంద్రకళకు స్వాధీనమైపోయినట్టుగా ఉన్నాను. ఇప్పటికి మన ప్రయాణం ముగిసినట్లేకద! కాని, మన కష్టాలకు ప్రారంభమే యిప్పుడని నా వుద్దేశం. తీరా రాజకుమారివద్దకు వెళ్లి, ఏమి సమస్య అడగాలెనో నాకేమీ తోచకుండావుంది. నాకు ఏ ఆలోచనా తట్టటమేలేదు. ఎంతో దూరాన మన దేశంలో ఉన్నప్పుడే ఆమెచిత్రం నాకు దిగ్భ్రమ కలిగించిందే. ఇప్పుడు ఆమె నిజరూపమే చూస్తే, నా హృదయం శూన్యమై, నోట మాటే రాకపోవచ్చు. అయినా, అటువంటి సౌందర్యరాశిని నావంటివాడు గెలిచే దేమిటి ధీనిధీ!..." అంటూ వాపోవసాగాడు.

అందుకు ధీనిధి "మిత్రమా!_ ఆ రాజకుమారి, తన లోకోత్తర స్వరూపం చూపి, మంత్రించినట్టు చెయ్యడంచేతనే, ఆమెను చూచేసరికల్లా సర్వమూ మరచిపోయి, తెలివితేట తప్పి, ఆమెకు లొంగి, అందరూ ఓడిపోవటం జరుగుతున్న

అయితే—నీవుమాత్రం అదృష్టవంతుడవే అని చెప్పాలి. ఎందు చేతనంటే, నేను నీ వెనుక ఉండడంబట్టి నీ కీ ప్రమాదం తప్పి పోయింది. నువ్వు రాజకుమారిని చూడగానే సర్వమూ మరచి పోయినా, నేను దగ్గిర వుండి పని సాధిస్తాను. అయితే, నీ వొకటి చేయాలి: మనం ఆమెయెదట పడినప్పుడు 'ఓ రాజ కుమారీ!- నా తరఫున నా మిత్రుడైన ఈ ఫణినిధి నీకు సమస్య లను ఇస్తాడు. ఇందుకు నీవు వప్పుకోవాలి సుమా!' అని చెప్పి, ఆమె అంగీకారం పొందడం నీ పని" అని చెప్పేసరికి, రాజుకు హృదయభారం తగ్గి, మనస్సుకు శాంతి ఏర్పడింది.

తిరిగీ, రాజు వేరే తలంపులు విడిచి, నిర్విచారంగా, చంద్రకళాదేవిని గురించే ధ్యానించుకోనటానికి అవకాశమూ కలిగింది.

మహారాజూ, ఫణినిధీ ఆ భవనం ఉండే ఆవరణ ప్రవే శించేసరికి, రక్షకులు ఎదురువచ్చి స్వాగతోపచారాలు చేశారు. వెంటనే ఈ సమాచారం చంద్రకళాదేవికి అందింది. ఆమె ఆజ్ఞ ప్రకారం వెంటనే కంచుకులూ, రాజమర్యాద లెరిగిన తగుమనుష్యులూ వచ్చి, అతిథులిద్దరినీ ఒక చక్కటి విలాస భవనంలోకి తీసుకు వెళ్లారు. అదే వారికోసం యేర్పాటయిన విడిదె.

అది ఒక అపురూపమయిన చక్కటి భవనం. చుట్టూ కన్నులపండువుగా ఉద్యానవనమున్నది. ఆ భవనమంతా చంద్ర కాంత శిలలతో నిర్మితమయింది. తోటలో గుబురుగా పెరిగిన రకరకాల చెట్లూ, పరిమళాలను వెదజల్లే రంగురంగుల పూల మొక్కలూ తన్మయత కలిగిస్తున్నవి. పరిమళ మిళితాలయిన

ఆ మందమారుతాలూ, పక్షులు చేసే కలకలారావాలూ ఎంత మనోహరంగా వున్నవో చెప్పతరంకాదు.

ఇలా వున్నప్పటికీ, హేమప్రభునికి మాత్రం స్తిమితం లేకపోయింది. తన సంగతి ఏమవుతుందో అనే దిగులు ఒకవంక, ఒక్కసారి ఆ రాజకుమారిని కంటితో చూడాలనే తహతహ ఒకవంక, ఆయనను వేగిరపెట్టినై. రాజు హృదయఫలకంమీద యిప్పుడు చంద్రకళ చిత్రం తప్ప మరొకటి ఏదీ లేనేలేదు. కనుక, మన స్తిమితం లేకనే, ఆయన పగటిపూటల్లా అతికష్టంతో గడపవలసివచ్చింది.

సూర్యాస్తమయం కాగానే హేమప్రభుడూ, ధీనిధీ రాజకుమారి విహరించే 'రత్నాల మందిరం' ప్రవేశించారు. అక్కడ వారు, కంచుకులు చూపిన కొలువుకూటంలో అడుగు పెట్టేసరికల్లా దిగ్భ్రాంతు లయ్యారు. ఇంద్రనీల మాణిక్యాలు పరచిన ఆ నేలపైన వారి అడుగుజాడలు ప్రతిఫలిస్తున్నయి. మణిమయములైన ఆగోడలలో వారి ప్రతిబింబాలూ, ఆ దివ్య భవనంలో వెలిగే దీపాలూ, అతిశయించి వేలకొద్దీ ఉన్నట్టుగా కనిపిస్తున్నయి.

ఆ కొలువుకూటంలో బంగారు సింహాసనాలు అనేకము లున్నాయి. ఆ పక్కనే రమణీయమైన ఉద్యానమున్నది. ఆ ఉద్యానములో వృక్షచ్ఛాయని ఒక శిలావేదికపైన చంద్రకళా దేవి ఆసీనురాలై వున్నది. ఆమె నీలిరంగు కలిసిన ఆకుపచ్చ చీర ధరించింది. రత్నాల రవిక తొడుగుకొనివుంది. చెవులవరకూ వ్యాపించివున్న ఆమె విశాలనేత్రాలు—కాటుకకన్నులు— నల్లనికాంతులను విరజిమ్ముతూ వున్నయి. ఆమె పెదవులు,

లాహూరాగం వ్రాయకపోయినా, లక్కవ్రాసినట్టే సహజమైన ఎరుపురంగుతో ప్రకాశిస్తున్నాయి. ఆమె ఒంటికి అలముకొన్న చందనపు పరిమళము భవనమంతటా గుప్పుమని వ్యాపిస్తున్నది. ఆమె సన్నటి నడుముచుట్టూ బంగారపు ఒడ్డాణం తళతళలాడు తున్నది. చేతులకు తొడుగుకొన్న బంగారపుగాజులూ, కాళ్లకు పెట్టుకొన్న బంగారు అందెలూ అత్యంత సౌందర్యాన్ని కూరు స్తున్నయి. ఆమె ధరించిన కిరీటం, నాగజాతిని స్ఫురింపజేసే సర్పాకృతిని కలిగివున్నది.

ఇటువంటి అలంకరణాలతో కూడుకొనివున్న ఆ రాజ కుమారిని చూచీచూడటంతో, హేమప్రభుడు తనను తానే మరచిపోయాడు. ఆయనను చూచి ఆమె కొంచెం చకితురాలై నట్లు కనిపించింది. అయినా, వెంటనే సర్దుకొని, తనను ఆయన పలకరించటానికి ముందుగా తనే, "మీరు అడగదలచిన ప్రశ్న అడగవచ్చు" అన్నది.

హేమప్రభుడు ఆమెకు ఎదురుగా ఒక శిలావేదిక పైన కూర్చొని, తదేకదృష్టితో ఆమె ముగ్ధమధురసౌందర్యాన్ని క్రోలుతూవుండగా, ఆమె పలికిన ఈమాట పిడుగులా చెవిని పడింది. పడేసరికల్లా ఆయన వెలవెలబోతూ, కూలబడి పోయాడు. నోటమాటే వచ్చిందికాదు.

అప్పుడు ధీనిధి ఆమె పాదాలదగ్గరకు వెళ్లి, వినయంగా నమస్కరించి "ఓ రాజకుమారీ!—నేను హేమప్రభుని మిత్రు డను. ఆయన తరఫున సమస్య లివ్వటానికి నన్ను నియ మించాడు. ఇందుకు నీవు అనుమతించాలని ప్రార్థిస్తున్నా" నన్నాడు.

ఒక్క—క్షణం చంద్రకళ ఆలోచనలో పడింది. ఇంతవరకు వచ్చినవాళ్ళలో ఎవళ్ళూ ఇటువంటి వింతకోరిక కోరిఉండలేదు. వారంతరూ రాజకుమారిని చూస్తూనే దిగ్భ్రాంతులై వుండి, అడిగేది ఏదో అవకతవకగా అడిగేవారు. అందుచేతనే ఓడే వారు. ఇంత నిదానంగా, నిబ్బరంగా, ఎదటబడి మాటాడటమనేది చంద్రకళకు సరికొత్త పద్ధతిగా తోచింది. నేడు ఆమెకు కలుగుతున్నవన్నీ కొత్త అనుభవాలే. క్షణమాత్రం ఆలోచించి, ఆమె 'సరే!' నన్నది.

ఫణినిధి ఆమెకు ఎదుట కొంచెం దూరంలో నిలబడి, తను వేయదలచుకొన్న ప్రశ్నను ఇలా ప్రారంభించాడు—

"ఓ రాజపుత్రీ!— కొంతకాలంకిందట ఒక ఊరిలో ఒక చార్వాకుడు ఉండేవాడు. అతను, తన వివాహానికి తగిన యత్నాలు చేసికొంటూఉండగా, స్నేహితుడు ఒకాయన వచ్చి, 'మిత్రమా!— నీవు ప్రయత్నాలన్నీ చురుకుగా చేస్తూన్నావు. బాగానేవుంది. గణపతిపూజకూడా చెయ్యి. అది అన్నిటికన్నా ముఖ్యంగా కావలసిందికద! గణపతిని పూజిస్తే, ఆతడు ఏ ఆటంకాలూ కలగకుండా, నిర్విఘ్నంగా వివాహం జరిగేటట్టు చూస్తాడు' అని చెప్పాడు.

గణపతి పేరు చెప్పేసరికి చార్వాకుడికి ఒళ్లు మండింది! ఏమంటే, చార్వాకులు నాస్తికులు. వాళ్ళు దేవతలనూ, వేదాలనూ నమ్మరు. అందుచేత, చార్వాకుడు వెంటనే అతనితో "ఓయి మూర్ఖుడా!— దేవతలనీ వేదాలనూ నమ్మేది మూర్ఖులూ మోసగాళ్లూ మాత్రమే. మానవులు వారివారి సౌకర్యాలకోసం ఏవో కొన్ని పనులుచేసి, వాటిని దేవుడికి అంట

గడతారు. దేవతలను గురించి జరిపే పూజలూ, పునస్కారాలూ నాకు పిచ్చివాళ్ళ కలలలాగా కనబడతాయి. లేదా, జీవనం గడుపుకోటానికని వేసే దొంగవేషాలన్నా కావాలి, అవి. నువ్వు చెప్పిన ఆ గణపతివల్ల ఉపయోగం ఏమిటి? విడ్డూరంకాకపోతే, మనిషి ఏనుగుతలతో ఉండడమేమిటి? మన పనులు జరగటానికి ఇలాటి వాడు ఏంచేయగలడు? ఏమిటి చేస్తాడు? మానవుడు బాగా ఆలోచించి, తెలివితేటలు ఉపయోగించి పని ప్రారంభిస్తే, దానంతట అదే నెరవేరుతుంది. నా తలచిన పని నిరాటంకంగా జరుగుతుందనే నమ్మకం నాకున్నది" అన్నాడు.

ఈ మాటలు వినాయకుని చెవినిపడ్డాయి. 'సరే, వీడి పని పట్టించాలి' అని అతను అనుకొన్నాడు. అన్నీ సిద్ధంచేసుకుని చార్వాకుడు పెళ్ళికి బయల్దేరేరోజున తెల్లవారేటప్పటికి గణపతి, వీథులలో తిరిగే ఒక ఆవును పిలిచి, 'ఓ ఆవ్వా!— నువ్వు వెంటనే ఈ చార్వాకుడి వీథిగుమ్మంముందు పేడవెయ్యి' అన్నాడు. అలాగే చేసింది ఆవు. చార్వాకుడు తలుపు తెరుచుకుని వస్తున్న తొందరలో, అతని కాలు పేడకుప్పమీద పడింది. అతను జర్రున జారిపడ్డాడు. మక్క విరిగింది. అతను లేచి మళ్ళీ మసలటానికి కొంతకాలం పట్టింది. ఈలోగా, అతను పెళ్ళాడదలుచుకొన్న కన్య మరొక సంబంధంచేసికొన్నది.

తరువాత చార్వాకునిదగ్గరకు మునపటి స్నేహితుడు వచ్చి "చూచావా, ఏమి జరిగిందో! ఇప్పుడైనా నామాటవిని గణపతిని పూజించు. నీపని నెరవేరుతుంది" అన్నాడు. అందుకు చార్వాకుడు "పోవయ్యా!—నువ్వు మూర్ఖతవల్ల ఇలా అంటున్నావు. లేకపోతే యేమిటి? జరగవలసిఉండే అలా జరిగింది.

ఎంత, ముందుజాగ్రత్త తెలిసినవాడైనా, ఆవు వచ్చి తెల్లారగట్ట గుమ్మంముందు పేడవేస్తుందని కలగంటాడా? దీనికీ గణపతికీ సంబంధం యేమిటి? ఈ పని నిజంగా గణపతిప్రభావంవల్లనే జరిగిందంటావా? అలా అయితే, ప్రపంచంలో ఆవుల నన్నిటినీ అతనే కనిపెడుతూ, ఆజ్ఞాపిస్తూ వుంటాడనా, నీవుద్దేశం? ఏమిటీ సిద్ధాంతం?" అంటూ, మిత్రుని హేళనచేసి పంపివేశాడు.

తరువాత, అతడు మళ్ళీ వివాహానికి ప్రయత్నంచేసి, అన్నీ సిద్ధంచేసుకుని బయలుదేర నిశ్చయించాడు. ఈమాటు, తనకు ముందుగా పోయి పేడా గీడా లేకుండా చెయ్యడానికి కొంత మంది వెట్టివాళ్ళను కూడా పెట్టుకున్నాడు. తను బయల్దేరే రోజున, దారి తెరపిచేసి శుభ్రంగా వుంచుమని వాళ్ళకు చెప్పి వుంచాడు. ఇదంతా గమనిస్తూనే వున్నాడు, గణేశ్వరుడు.

చార్వాకుడు బయల్దేరే రోజున - బలిపీఠంమీంది మెతుకులు ఏరుకుతినడానికి వచ్చిన కాకిని చూచి "కాకీ! కాకీ! చార్వాకుడొకడు పెళ్లిచేసికోవటానికి ఆ వీథంట తరలివెళ్తున్నాడు. ఆ వీథిలో ఒక దర్వాజా వుంది. ఆ దర్వాజా గోపురం నడుమ నా విగ్రహమొకటి ఎండకు ఎండుతూ, వానకు తడుస్తూ, గాలిదెబ్బలు తిని, పట్టు తప్పి శిథిలావస్థలో వుంది. చార్వాకుడు దానికిందనుంచి వెళ్లేసమయానికి సరీగా, నువ్వు వెళ్లి ఆ విగ్రహంమీంద వాలు," అని చెప్పాడు.

అలాగే చేసింది ఆ కాకి. అది ఆ దర్వాజాదగ్గరే తిరుగులాడుతూ, సమయం కనిపెట్టి ఆ గణపతివిగ్రహంమీంద వాలింది. వాలీ వాలడంతోనే ఆ విగ్రహం, గోపురం కింది నుంచి పోతున్న చార్వాకుడి మీంద పడి, అతని చెయ్యి విరిగింది.

అది బాగయేసరికి కొంతకాలం పట్టింది. ఈలోగా, పెళ్లికి నిశ్చయమైన ఈ కన్యకూడా మునపటిలాగానే మరొక వరుణ్ని వివాహం చేసేసుకున్నది.

అప్పుడు చార్వాకునివద్దకు వెనకటి మిత్రుడు వచ్చి "మిత్రుడా! నీ తెలివితేటలు ఏమయాయో చూచావా? ఇప్పుడైనా నామాట విను. నీప్రయత్నాలకు విఘ్నాలు కలిగిస్తున్నవారెవరో, యిప్పుడైనా అర్థంచేసుకో" అన్నాడు.

చార్వాకుడు ఉగ్రుడై "ఇక నీ పేలాపనలు కట్టిపెట్టు. ఈ పాడువ్వూరిలో ఆవులు గుమ్మాలలో పేడ వేస్తాయనీ, దర్వాజాలలో విగ్రహాలు విరిగి పడతాయనీ ముందుగా ఎవరైనా అనుకుంటారా? నీ గణపతిని అవతల తీసిపెట్టు. అతని అవసరం లేకుండానే నాకు పెళ్లి అవుతుందో లేదో చూడు. ఇలాంటి ప్రమాదాలు జరక్కుండా నేనేమి చేస్తానో, నీకే తెలుస్తుంది" అని బదులు చెప్పి, మిత్రుణ్ని పంపివేశాడు.

తర్వాత మరొక కన్యను వెతికి, పెళ్లికితగిన ఏర్పాటులు చేసుకున్నాడు. ఈ సారి ఆవుల బాధా, విగ్రహాల బాధా లేకుండా - వధువుయింటికి వీథుల్లోంచి వెళ్లడం మానివేసి, చుట్టుదారిని - పొలాలలోనించి వెళ్లడానికి నిశ్చయించాడు. చార్వాకుడి పట్టుదల చూసి గణపతి మిక్కిలి కోపించాడు. యీసారి గట్టిగా తగినశాస్తి చెయ్యాలని నిశ్చయించుకొన్నాడు. యింద్రుడిదగ్గరకు పోయి "ఓయీ దేవేంద్రుడా! చార్వాకుడొకడు పెళ్లి చేసుకోడానికి వెళుతున్నాడు. అతడు వెళ్లేదారిలో ఒక ఏరు అడ్డంగా వుంది. అది యిప్పుడు ఎండిపోయింది. ఆ నాస్తికుడికి తగిన శాస్తి చెయ్యాలి. నువ్వు నీ మేఘాల్ని నాతో

ఒకసారి పంపు" అన్నాడు. ఇంద్రుడు మేఘాల్ని వినాయకుడి వెంట పంపించాడు.

సరిగా, చెప్పిన సమయానికి అవి బ్రహ్మాండంగా కొండల మీద వర్షించాయి. చార్వాకుడు ఏరు దాటుతూవుండగా, హఠాత్తుగా వరద వచ్చి, ఆ వరదలో అతడు కొట్టుకొని పోయాడు. మరి ఎప్పటికీ తేలనేలేదు. దీని నంతటినీ వినాయకుడు చూస్తూనే వున్నాడు. అతడు మొదట పకాలున నవ్వి, వెంటనే గట్టిగా ఏడ్చాడు.

రాజకుమారీ! గణపతి అలా మొదట నవ్వడానికీ, తర్వాత ఏడవడానికీ కారణం ఏమిటై వుంటుందో!" అని ప్రశ్నించి ఊరకున్నాడు ధనిధి.

చంద్రకళాదేవి యిలా సమాధాన మిచ్చింది: "గణపతి ఆ చార్వాకుని మూర్ఖత్వానికీ, అజ్ఞానానికీ, అహంకారానికీ నవ్వాడు. ఆ నాస్తికుడు యిలా దేవతలని తిరస్కరించినందుకు అనుభవించే ఘోర నరకాలను తలుచుకుని—'అయ్యో! తన పనులకు ముందుముందు ఎలాంటి ప్రతిఫలం రానున్నదో గమనించలేకుండా వున్నాడుగదా యీ నాస్తికుడు!' అనుకుని విచారించటంచేత గణాధిపతికి పెద్దగా ఏడుపు వచ్చింది."

ఇలా అంటూ హేమప్రభువునివైపు చూడకుండా ఆమె వెళ్ళిపోబోతూ తన మృదుహస్తాన్ని కొంచెం ఆడించి మరీ వెళ్ళిపోయింది. రాజు మనస్సు ఆమె వెంటనే వెళ్ళింది. శరీరం మాత్రం ధనిధితోకూడా బస చేరుకుంది. బసకు వచ్చినతర్వాత హేమప్రభుడు నిట్టూర్పువిడిచి 'ధనిధీ! నువ్వు ప్రశ్న అడగనూ అడిగావు. ఆమె సమాధానం చెప్పనూ చెప్పింది. నువ్విలా ఒక

రోజు వ్యర్థంచేశావు. అయినా చంద్రకళ, పోతూ పోతూ చెయ్యి విసరడంచేత, ఆ శుభచిహ్నం చూసి నిన్ను క్షమించాను. ఆమె హస్తం, తీగచివర వికసించివున్న పుష్పంలాగ నామనస్సును ఆకర్షించింది. ఆమె చిత్రాన్ని వ్రాసిన చిత్రకారుడి నైపుణ్యం యిప్పుడు బోధపడింది నాకు! అది సామాన్యమైన చిత్రం కాదు! అద్దంలో కనిపించే ఆమె ప్రతిబింబమే యిది! కేవలమూ, ఇదే నాదగ్గిర లేకపోతే—ఆమెవలన కలిగే విరహబాధను సహించి, రేపటివరకూ నేను జీవించివుండడం కేవలమూ అసంభవమే" అన్నాడు.ఎలాగో ఒకలాగున ఆరాత్రి గడిచింది.

# రెండవ రాత్రి



సూర్యుడు ఉదయించి, మరొక రోజు వచ్చిందని తెలియ జేశాడు. మిత్రులిద్దరూ ఆ పగలల్లా పూలతోటలోనే కాల క్షేపం చేశారు. పొద్దు వాలుతున్నకొద్దీ రాజుకు చంద్రకళను చూడాలనే తహతహ ఎక్కువ కాజొచ్చింది. సాయంత్రం అయాక వారు మామూలుప్రకారం ఉద్యానవనానికి వెళ్ళారు. వారు వెళ్లేసరికే చంద్రకళాదేవి శిలావేదికపైని కూర్చునివున్నది. ఆమె యీవేళ పసుపుపచ్చని చీర కట్టుకుని, వజ్రాలరవిక తొడు క్కుని, వాటికి తగిన కిరీటాభరణాలు ధరించివుంది. హేమ ప్రభుడు రాగానే ఆమె అతనివైపు సాభిప్రాయంగా చూచింది. ఆ చూపునకు అతని శరీరమంతటా చక్కిలిగింతలు పెట్టినట్ల యింది. నోరు మెదల్పకుండా రాజు శిలావేదికమీద కూల బడ్డాడు. వెంటనే ధీనిధి ఆమెయెదుట నిలిచి యిలా ప్రారం భించాడు—

"రాజపుత్రీ! పూర్వం ఒక దేశాన్ని ఒకరాజు పాలిస్తూ వుండేవాడు. అతనికి లేక లేక ఒక్కడే కొడుకు. ఆ కుమా రుడు పుట్టిన కొద్దికాలానికే జబ్బుచేసి రాజు చనిపోయాడు. ఆ రాజుకు ఒక తమ్ముడుండేవాడు. రాజుకు కలిగిన ఆ పసిబిడ్డను ఎలాగైనా చంపించి, తానే రాజ్యాన్ని ఆక్రమించాలని ఆ తమ్ము నికి దురాశ కలిగింది. ఏ వుపాయంచేతనైనా పసిబిడ్డను ఇట్టే చంపివేయవచ్చునని అతను అనుకున్నాడు.

ఒకనాటి రాత్రి రాజసోదరుడు కొందరు నౌకర్లకి లంచా లిచ్చి, వారు బాలరాజును గదిలో ఒంటరిగా విడిచి వెళ్లిపోయే టట్లు ఏర్పాటుచేశాడు. కొత్తగా కొలువులో చేరిన ఒక రాజ పుత్రవీరుడికి కోరినంత ధనం లంచమిచ్చి గదిలో ఒంటరిగా వున్న రాజును ఫలానాసమయంలో చంపివెయ్యాలని చెప్పగా, డబ్బుఆశకొద్దీ వాడు అందుకు అంగీకరించాడు.

సమయంచూచి ఆ వీరుడు బాలరాజు వున్న గదిలో మెల్లగా ప్రవేశించాడు. అక్కడ, ఒక పందు పెట్టుకొని ఆడు కొంటూవున్న ఆ పసిబిడ్డతప్ప మరెవ్వరూ కనిపించలేదు. నిజానికి రాజెవ్వరైనదీ ఆ కొత్తవానికి తెలియనే తెలియదు. ఎవరో యువకుడైన ఒకరాజు అక్కడికి వస్తాడుకాబోలునని తలిచి వాడు ఎదురుచూస్తూఉండగా, బాలరాజు ఆడుకుంటూవున్న పందు దొర్లిపోయి ఆ వీరుడి కాళ్ళదగ్గిరికి వచ్చింది.

పందు జారిపోవడంతో బాలరాజు కెవ్వుమన్నాడు. ఇంతలో వీరుడు ఆ పందును శిశువుదగ్గరికంటూ దొర్లించాడు. బాలరాజు దాన్ని పట్టుకుని కిలకిలా నవ్వి సంతోషంకొద్దీ చేతు లతో చప్పట్లు కొట్టాడు. ఇది చూస్తూ వీరుడుకూడా బాలుడితో ఆడుకొంటూ వుండగా, కొంతసేపటికల్లా సేవకులు వచ్చి 'నువ్వెవరవు ? ఇక్కడికి ఎందుకొచ్చావు ?' అని కొత్తవాడిని అడిగారు.

'నేను వార్తాహారుణ్ణి. నా యజమానిదగ్గరనుంచి రాజు గారి కొక వార్త తెచ్చాను' అని అతడన్నాడు. వాళ్ళు పక పక నవ్వి 'రాజుగారికా? వార్తా? ఆయన ఎప్పుడో గతించారు. ఇప్పుడున్న రాజు ఈ పసిరాజే!' అన్నారు. వీరుడు తెల్ల

బోయి, కంగారుపడ్డాడు. అతడు బాలరాజుకు అపాయం కలిగించడానికి వచ్చాడని అనుమానపడి నలుగురూ నాలుగు దెబ్బలు వేసేసరికి, వాడూ ఊరుకోలేదు. అందులో ఒకళ్ళని గట్టిగా కొట్టి తప్పించుకు పారిపోయాడు. ఇక అక్కడ వుంటే మాట దక్కదని, కొలువు వదులుకుని ఎవ్వరికీ చెప్పకుండా ఆ ఊరే విడిచి పారిపోయాడు.

ఈ ప్రయత్నం యిలా వ్యర్థం కాగానే, రాజసోదరుడు మరొక ఉపాయం ఆలోచించాడు. అతడు ఒక దొంగలజట్టుకు బాగా లంచమిచ్చి ఊరి అవతల వాళ్ళు ఉండాలనీ, బాలరాజు సేవకులతో కూడా ఊరికి దూరంగా వున్న గుడికి వెళ్లి తిరిగి వచ్చేటప్పుడు పైనబడి, బాలరాజుని ఎలాఅయినా చంపుమనీ వాళ్లతో చెప్పాడు. 'సరే' అన్నారు వాళ్లు.

రాజసోదరుడు ఏర్పాటుచేసిన యీ దొంగలజట్టు చేరుకోవడానికి ముందే మరొక దొంగలగుంపు బాలరాజునూ, సేవకులనూ అటకాయించి, తమ సంగతి బయటపడకుండా వుండటానికిగాను సేవకులందర్నీ చంపేసింది. ఆ సేవకులలో ఒకడుమాత్రం తప్పించుకు పారిపోగలిగాడు.

నోరూ, వాయీ లేని పసిబిడ్డ ఏం చెప్పగలదనే వుద్దేశంతో, ఆ దొంగలు బిడ్డనుమాత్రం విడిచిపెట్టి పోయారు. తర్వాత తప్పించుకు బయటపడ్డ సేవకుడు వచ్చి, ఆ బిడ్డను గుడ్డలతో కప్పి ఒక బీదవాడి వేషంతో ఊళ్ళోకి చేర్చాడు.

లంచం తిన్న దొంగలు ఎంతసేపు దారి కాచినా, ఎవ్వరూ ఆ దారంట రావడం కనబడలేదు. వాళ్లు, బాలరాజును సేవకుడు గుడ్డలతో కప్పి తీసుకొనిపోవడం చూశారుగాని—

వాడెవడో ముష్టివాడుకాబోలు, అలా పోతున్నాడనుకుని ఊరు కున్నారు. అంతకుముందు ఏంజరిగిందీ వాళ్లకేం తెలుసు? ఇలా రాజసోదరుడి రెండో ప్రయత్నంకూడా నిష్ఫలమై పోయింది.

ఇది పనికాదని తలచి, రాజసోదరుడు ఈసారి వంటమని షికి బాగా ఎక్కువగా లంచమిచ్చి, బాలరాజుకిచ్చే పాలల్లో విషం కలిపించాడు. పాలుతాగుదామని బాలరాజు, గాజుపాత్రను రెండుచేతులతోనూ నోటిదగ్గిర పెట్టుకునే సమయానికి దగ్గిరున్న ఒక సేవకుడు తుమ్మాడు. ఆ తుమ్ముకి బాలరాజు తుళ్లుక్కు మనడంతో, అతని చేతిలోని గాజుగిన్నె కిందపడి ముక్క ముక్కలై పోయింది. ఆ ముక్కలై పోవటం అదో ఆటలాగా ఎంచి బాలరాజు కేకలేస్తూ, చప్పట్లు చరుస్తూ సంతోషం వెలి బుచ్చాడు. ఇలా మూడో ప్రయత్నంకూడా విఫలమైపోయింది. మరొక ఉపాయం ఆలోచించుదామని అనుకోనటానికిముందే ఆ రాజసోదరుణ్ణి—అవినీతిప్రవర్తనకు ప్రతిఫలంగా ఒకానొక క్షత్రియుడు చిత్రవధచేయటం జరిగింది.

రాజకుమారీ! రాజసోదరుడు చేసిన యత్నాలన్నీ ఇలా వ్యర్థమైపోవడానికీ, ఏ ప్రయత్నమూ లేకుండానే బాలరాజు తప్పించుకు పోగలగటానికీ కారణం యేమైవుంటుందో!" అని చెప్పి, శ్రీనిధి మౌనం వహించాడు.

ఆమె యిలాగ సమాధానం చెప్పింది: "ద్రోహం తలపెట్టిన రాజసోదరుణ్ని, అతని పన్నుగడలు ఫలించకుండా చేసిందీ, కలవరపెట్టిందీ బాలరాజు అమాయికత్వమే. వాని పసి తనమే బాలరాజును రక్షించింది. ఎలా అంటే: ఇనపపెట్టెలో

భద్రపరిచిన విలువగల ఆభరణంకంటె, నేలమీద నిర్లక్ష్యంగా పారవేసిన రాయే ఎక్కువ సురక్షితంగా వుంటుంది—రాయి మీద ఎవ్వరికూ అంతగా మోజు వుండదు కనుక. వేలాది సైనికులు పరిరక్షించే గొప్ప బలవంతునికన్నా నిరాయుధుడూ నిస్సహాయుడూ ఐన దుర్బలుడే ఎక్కువ సురక్షితంగా వుంటాడు- అనగా, తన దుర్బలత్వమే అతనిని రక్షించిందన్నమాట. ఇంకా చెప్పాలంటే: విషం మింగి దానికి విరుగుడు వేసుకోవడంకంటె, అసలు విషమనేది మింగకపోవటమే మేలుకద! అందం కలిగి ఉండటమే అపవిత్రతకు దారితీస్తున్నది. కాబట్టి, అందం లేకపోవటమే పవిత్రత అన్న మాటకద! శత్రుబారినుండి కాపాడటానికే దుర్గములు ఏర్పడినై. శత్రువులూ శత్రువులనుండి రక్షణ అనే సమస్యలే లేకుంటే దుర్గముల అగత్యమే ఉండదుకదా!- కనుక, యిప్పుడు - శిశువును నిస్సహాయత రక్షించినట్టుగా, ఎంతమంది రక్షకులున్నా కాపాడలేరని తేలిందికద!- నిజానికి, లలిత సుందరమైన తామరపువ్వునకు శత్రువు లెవరుంటారు!" అని చెప్పి, చంద్రకళ ఉద్యానంనుంచి లేచి వెళ్తుతూ, వెనుకకు తిరిగి హేమ ప్రభునివైపు ఒక్కచూపు విసరి, మరీ వెళ్లిపోయింది. రాజు మనస్సు ఆమెను వెంబడించింది. అతని కాళ్లు శరీరాన్నిమాత్రం మెల్లిగా యీడ్చుకొని బసలో పడవేశాయి.

అప్పుడు రాజు ధీనిధిని చూచి "ఓయీ! కఠిన హృదయుడా! మళ్లీ మనకు పరాజయం కలిగింది. రెండవరోజు కూడా నువ్వు వ్యర్థంచేశావు. ఈ అపరాధానికి నీకు శిక్ష పడవలసిందే; కాని నేను ఆమె పోతూపోతూ వెనక్కితిరిగి నావేపు చూడడం సంభవించినందున నిన్ను క్షమించాను. ఆ చూపు నా

హృదయాన్ని వలవేసి పట్టినట్లు పట్టుకుని లాగుకొని పోయింది. ఆమె చిత్రమే నాదగ్గిర లేకపోతే రేపటివరకూ నేను జీవించి ఉండడం కల్ల" అని అంటూ ఆ చిత్రాన్ని చూస్తూనే రాత్రంతా నిద్రలేకుండా గడిపాను.

---

# మూడవ రాత్రి



సూర్యుడు ఉదయించి మరొక రోజు వచ్చిందని లోకానికి తెలియజేశాడు. హేమప్రభుడు పగలల్లా అతికష్టంమీద పూలతోటలోనూ, చుట్టుపక్కలా మిత్రుడితోకూడా తిరిగి, కాలం గడిపాడు. సాయంత్రం అయేసరికి మిత్రులిద్దరూ మామూలుప్రకారం చంద్రకళాదేవి ఉండే ఉద్యానవనానికి చేరుకున్నారు.

వారక్కడికి వచ్చేసరికే చంద్రకళ శిలావేదికపై కూర్చుని వుంది. నాడు ఆమె నల్లటిచీర ధరించి నీలాలరవిక తొడుక్కొని, తదనుకూలమైన నగలూ, కిరీటమూ ధరించి వుంది. ఆమె రాజు వైపు దయగా చూసేసరికి, అతని శరీరం జలదరించింది. అతడు మామూలుగా, మౌనంగానే శిలావేదికమీద దేహం చేరవేసి, చూపులతో ఆమె సౌందర్యాన్ని ఆప్యాయంగా గ్రోలుతూ వుండగా ధీనిధి రాజపుత్రికయెదుట నిలబడి యిలా ప్రారంభించాడు—

"రాజకుమారీ! ఒకవూళ్ళో ఇద్దరు స్నేహితులు ఉండేవారు. ఇద్దరూ ఒక్క యీడువారు. అందమైనవారు. వాళ్ళను ఎరుగనివాళ్ళు ఇద్దరూ ఒక్కతల్లి బిడ్డలే అనీ, కవలబిడ్డలై వుంటారనీ అనుకుంటారు. ఇరుగుపొరుగుల బిడ్డలు కావటంచేత చిన్నప్పటినుంచీ యిద్దరూ ఒకేచోట పెరిగారు. పెద్దయాక కూడా వారెంతో స్నేహంగా ఉండేవారు.

వాళ్ళ పేర్లు ఏమో మనకు తెలియవుకాని, పుట్టుకను బట్టీ, ఒకడికి యింకొకడు ప్రతిబింబంలా వుండడాన్ని బట్టీ, పెద్ద వాడికి బింబుడనీ, రెండోవాడికి ప్రతిబింబుడనీ పేర్లు వాడుక లోకి వచ్చాయి. స్వరూపాలే కాకుండా కంఠస్వరాలుకూడా ఒకే మోస్తరుగా వుండడంచేత వారిలో బింబుడెవరో ప్రతిబింబు డెవరో కనిపెట్టలేక తికమకపడడం కద్దు.

ఆ వూరిలో యేటా అతివైభవంగా వసంతోత్సవం జరుగుతూ వుంటుంది. ఆ ఉత్సవానికి దేశదేశాలనుండి ఎంద రెందరో చూడవస్తారు. అలాంటి ఉత్సవంలో ఒకప్పుడు బింబుడు ఒక చక్కని కన్యను చూడటం తటస్థించింది. ఆ కన్య కూడా బింబునివంక చూచింది. ఇరువురి చూపులూ కలిసినై.

అటుతరవాత, ఆ కన్యనుగురించిన పుట్టుపూర్వోత్తరా లన్నీ బింబుడు శ్రమపడి తెలుసుకొన్నాడు. అంతేకాదు. ఆ అమ్మాయి వుండే వూరు చేరుకొని, వాళ్ళవాళ్లతో పరిచయం చేసుకుని, తన్మూలంగా ఆమె చనవు సంపాదించాడు.

వారిరువురి మధ్యనీ ప్రేమ అభివృద్ధి అయేటప్పటికి, ఆమెను బింబుడు పెళ్లాడటానికి నిశ్చయించుకున్నాడు. తన నిశ్చయం వెల్లడించగానే, ఇందుకు వాళ్ళవాళ్లూ సమ్మతించారు.

సంతోషం పట్టలేక బింబుడు ప్రతిబింబునివద్దకు వెళ్లి, "ఫలానా వసంతోత్సవంలో నేనొక అమ్మాయిని చూచాను. ఆమె అతిలోక సౌందర్యవతి. వాళ్ల ఊరుకూడా వెళ్లి, వాళ్ళ తలి దండ్రులతో మాటాడాను. ఆమెకూ నాకూ వివాహ నిశ్చయం కూడా జరిగింది" అని చెబుతూ, "ఇదుగో ఆకన్య రూప పటం" అని చెప్పి ఆమె చిత్రాన్నికూడా చూపించాడు.

ఈ సమాచారమంతా వినేసరికి, ప్రతిబింబునికి బింబుని మీాద అసూయ ప్రారంభమయింది. అంత చక్కటి అమ్మాయిని తనే పెళ్ళాడాలనే బుద్ధిపుట్టింది. అందుచేత, దానికి తగిన పన్నుగడ పన్నాడు. అది యేమిటంటే: సరీగా సుముహూర్తం నాడు బింబుడికంటే ముందుగా తనే వధువు యింటికి వెళ్ళటం, ఆ ముందురోజున ఏదో పని వున్నదని మిషపెట్టి, మరొకవూరు తీసుకపోవటం, అక్కడ అతనిని నిలిపివేసి సుముహూర్త సమయానికి రాకుండా చెయ్యటం—ఇదీ వ్యూహం. ఇందుకు తగిన ఏర్పాటులన్నీ చేసి, సుముహూర్తం రోజున తనే ముందుగా కన్య యింటికి చేరుకున్నాడు.

అప్పటికే అక్కడ సన్నాహాలన్నీ పూర్తి ఐనాయి. సనాయి వాయిద్యాలు మోగుతున్నాయి. ఆడపెళ్లివారు ప్రతిబింబుడిని గౌరవంగా తీసుకువెళ్లి పీటలమీాద కూర్చోబెట్టారు. ఇక, వధువు మెడలో మంగళసూత్రం కట్టడమే తరవాయి!

ఆ సమయంలో—నురుగులు గక్కుకొంటూ, వాయువేగాన వచ్చి వాలాడు బింబుడు! చూచాడు. సంగతి తెలుసుకున్నాడు. ప్రతిబింబునివైపు తీక్షణంగా చూస్తూ నిలబడ్డాడు. అతడూ యితనిని కోపంగా చూచాడు. వధువూ, ఆమె బంధువులూ నిర్ఘాంతపోయారు!! ఒకే అచ్చునపోసినట్టు కవలలాగా వుండే ఆ యిద్దరిలో ఆమెకు భర్త కావలసిన వాడెవరో ఎవరూ నిర్ణయించలేకపోయారు. తనకే ఆమె భార్యగా నిర్ణయింపబడిందని బింబుడూ, తనకే నిశ్చయింపబడిందని ప్రతిబింబుడూ వాదింప సాగారు.

చివరకు వాళ్లిద్దరూ న్యాయస్థానానికి వెళ్ళవలసివచ్చింది.

న్యాయాధిపతి కన్యకను చూసి, "వీరిద్దరిలో నువ్వు ప్రేమించింది ఎవరినో చెప్పగలవా ?" అని అడిగాడు.

అందుకామె "అయ్యా !- నేనేమీ చెప్పలేకుండా వున్నాను. ఇటువంటి వింతమనుషులు, ఒకే పోలికగలవాళ్ళు ఇద్దరుంటారని ఇంతవరకు నేను ఎరుగనే ఎరుగను" అని జవాబు చెప్పింది.

రాజపుత్రీ !—ఈ పరిస్థితులలో ఆ కన్యక, ఆ యిద్దరిలో ఎవరిని ప్రేమించి పెళ్లాడటానికి నిశ్చయించగలిగి వుంటుందో ?" అని ప్రశ్నించి ఊరకున్నాడు, ధీనిధి.

చంద్రకళ ఇలా చెప్పింది : "న్యాయాధికారి ఆ ముగ్గురనూ మూడుచోట్ల వేరువేరుస్థలాల్లో దూరదూరంగా కూర్చోబెట్టాలి. ఆ వధువు ఎక్కడ ఏస్థితిలో తన ప్రియుణ్ణి చూచిందీ, ఆతను ఏవిధంగా ఆమె అభిప్రాయం కనిపెట్టిందీ, ప్రత్యేకంగా ఒకొక్కరినే అడిగి తెలుసుకోవాలి. ఆమె చెప్పిన జవాబు ఎవని మాటలకు సరిపోతే అతనే ఆమెకు భర్త అని నిర్ణయించాలి. అలాటప్పుడు నిజమైన బింబుడు ఎవరయిందీ తేలికగా తెలిసిపోతుంది."

ఇలా చెప్పి, చంద్రకళాదేవి శిలావేదికమీదనుంచి లేచిపోతూ, రాజువేపుచూసి ఒకమారు నవ్వి వెళ్లిపోయింది. రాజు మనస్సు ఆమె వెనకాలే పరుగెత్తివెళ్ళింది. శరీరంమాత్రం ధీనిధితోబాటు బస చేరుకుంది.

అప్పుడు హేమప్రభుడు ధీనిధిని చూసి "మిత్రుడా ! ఈ రోజుకూడా రాజకుమారి నీప్రశ్నకి సమాధానం చెప్పివేసింది. ఈ మూఢవరోజుకూడా వృథాగా పాడుచేశావు. ఈ అపరాధా

నికి నిన్ను క్షమించకూడదు. అయినా, నేను ఆమె నన్ను చూసి నవ్వడం జరిగినందున—ఆ ఉపకారాన్ని మనసులో పెట్టుకొని నిన్ను క్షమిస్తున్నాను. చంద్రుడు అడవిలోని బయళ్ళను ప్రకాశింపజేసినట్లు ఆమె నవ్వు నా హృదయానికి వెలుగునిచ్చింది. ఆమె వెళ్ళిపోగానే మళ్ళా చీకటి ఆక్రమించుకుంది. ఈ చిత్రపటమే లేకపోతే, నేను తెల్లవారేవరకూ బ్రతకడమే దుర్ఘటం" అంటూ ఆ చిత్రాన్నే చూస్తూ రాత్రి వేగించాడు.

---

# నాల్గవ రాత్రి



తెల్లవారింది. రాజు ధీనిధితో కూడా అతి కష్టంమీద పగల్లా పూలతోటల్లో తిరుగుతూ గడిపి, సాయంత్రం కాగానే యథాప్రకారం రాజకుమారి ఉద్యానవనం చేరుకున్నాడు. మిత్రు లిద్దరూ వెళ్లేసరికే ఆమె శిలావేదిక అధిష్ఠించివుంది. నాడు చంద్రకళ లేతగులాబిరంగు చీర ధరించి పచ్చల రవిక తొడుక్కొనివుంది. రాజును చూసి సిగ్గుపడినట్లుగా ఆమె తల వంచుకుంది. శిలావేదికమీద కూర్చున్న హేమప్రభుడు ఆ చూపువల్ల దెబ్బతిన్నట్లుగా కుంగిపోయాడు. ఆమె సౌందర్యానికి ముగ్ధుడై నోట మాటలేక అతడు అలాగే కూర్చుండిపోయాడు. అప్పుడు ధీనిధి రాజపుత్రిక యెదుట దూరంగా నించుని ఇలా అన్నాడు—

"రాజకుమారీ!_ ఒక దేశంలో ఒక రాజుండేవాడు. అతడు ఒకప్పుడు తన పొరుగురాజుమీదికి దాడివెడలి, ఘోరమైన యుద్ధం చేశాడు. అతని సేనలోని ఒక క్షత్రియ వీరుడు అత్యద్భుతంగా తన విధిని నెరవేర్చుకొన్నాడు. శత్రువు చేతులలో వీరుని తలకు బలమైన గాయాలు తగిలినై. ఆ గాయాల నుండి నెత్తురు బలబలమని ప్రవహించేసరికి, అతను యుద్ధభూమి లోనే సొమ్మసిలి పడిపోయాడు. అతను పడిపోయాడు కాని, అతని ప్రభువుకి మాత్రం జయం కలిగింది.

యుద్ధంలో దెబ్బలుతిన్న వీరులనందరినీ చికిత్సకోసం

రాజభటులు మోసుకుపోసాగారు. సొమ్మసిలి పడివున్న ఈ వీరునిమట్టుకు చూచిన్నీ, చచ్చిపోయివుంటాడని తలిచి, రాజ భటులు వదిలేసిపోయారు.

వాళ్లు వెళ్లిన మరి కొంచెంసేపటికల్లా ఆ క్షత్రియవీరుడికి తెలివి వచ్చింది. వంట్లో శక్తి లేకపోయినప్పటికీ, ఎలానో కాళ్లీడ్చుకొంటూ ఆ దగ్గరనే ఒక వూరు చేరుకొన్నాడు. అక్కడ ఒక యింటి గుమ్మంవద్దకు పోయి తలుపు తట్టబోయాడు. కాని, ప్రాణలేక జోగిపోయి, ఆ తలుపుమీద పడ్డాడు. తలకు మళ్లీ దెబ్బతగిలింది. నిల్చున్నపాటునే ఆ గడపలో మూర్ఛపడి పోయాడు.

అది ఒక బ్రాహ్మణ గృహం. యజమాని ఇంట లేడు. గ్రామాంతరం వెళ్లివున్నాడు. అతని భార్య సువర్ణమాల ఒక్కర్తే ఇంటిలో వున్నది. ఆమె యౌవనవతి. అందాల బరిణె. అర్ధరాత్రి సమయమైనప్పటికీ, తలుపు కొట్టిన చప్పుడు కాగానే ఆమె తుళ్లిపడి లేచింది.

లేచి, ధైర్యం తెచ్చుకుని, కిటికిలోనించి చూసింది. గాయపడి నెత్తురులోడుతూ, బాధపడుతున్న ఒక మనిషి తమ గుమ్మంలో చాపకట్టుగా పడివుండటం కనిపించింది. వాని అవస్థ చూచి ఆమెకు గుండె నీరై పోయింది. ఆతడు తమ గుమ్మంలోనే గుటుక్కుమంటే, చూస్తూ వూరుకున్నందుకు ఆ పాపం వచ్చి తనను చుట్టుకుంటుందే! పోనీ సాహసించి, లోపలకు తీసుక పోయి పరిచర్యలు చేదామనుకుంటే- ఆ అర్ధరాత్రి సమయంలో, అందులోనూ భర్త లేనప్పుడు పరాయిపురుషుణ్ణి ఇంట్లో పెట్టుకోవటం భావ్యంకాదుకదా!—— ఈ సమస్యలతో ఆమె

మనస్సు వేగిపోయింది.

బాగా ఆలోచించి, ఏమైనాసరే వానిని రక్షించటమే తన కర్తవ్యమని నిశ్చయించింది. నిశ్చయించి, వెంటనే పనికత్తెను లేపింది. తలుపు తెరిచింది. ఇద్దరూ సాయంపట్టి ఆ పురుషుణ్ని లోపలకు తీసుకువచ్చి, ఒక మంచంమీద పడుకోబెట్టారు. చికిత్స చేశారు.

చికిత్సవల్ల ఆ వీరుడికి క్రమేణా నిమ్మళించింది. గాయాలు పూర్తిగా మానిపోయేవరకూ అతడు అక్కడనే వున్నాడు.

ఆ క్షత్రియ వీరుడు రోజూ ఆ సుందరిని చూస్తూ, ఆమె అపురూపసౌందర్యానికి ముగ్ధుడై పోయాడు. చూడగా చూడగా ఆతని మనసులో ఒక దుష్టకోరిక కలిగింది. దాపరికం లేకుండా ఆతను తన కోరికను ఆమెకు వెల్లడించాడు.

ఆ మాట వినగానే, ఆమె చెవులురెండూ మూసుకొని "ఛీ, కృతఘ్నుడా! నీకు చేసిన ఉపకారానికిగాను నీవు తలచిన ప్రత్యుపకారం ఇదేనా? నీ ముఖం చూస్తే పంచమహాపాతకాలూ చుట్టుకుంటాయి, ఫో!" అని కసరికొట్టింది.

ఈ మాటలు క్షత్రియవీరునికి ఛెళ్లుమని కొరడాతో కొట్టినట్టయినై. వెంటనే అభిప్రాయం మార్చుకున్నాడు. ఆమెకు మొక్కుతూ, "అమ్మా!— నీ లోకోత్తర సౌందర్యం చూస్తే తపస్సుచేసుకొనే మునులకు సైతం మనస్సు వికలమై పోతుంది. అటువంటిది నేనొక లెక్కా!—పోతే, నీవు నాకు చేసిన మహోపకారానికి ఆజన్మాంతమూ నేను దాసుడనై ఉండాల్సిందే. ఈ మాట నాకు తెలుసు. ఐతే, నీ యెదుటఉన్న నాకు, ఎంత యత్నించినా మనసు స్వాధీనం తప్పిపోతున్నది. పతి

ప్రతవు, ఉత్తమశీలవు, అయిన నీ పట్ల ఏవిధంగా ప్రవర్తిస్తానో నాకే తెలియకుండా వున్నది. కనుక, వెంటనే నేను ఇక్కడి నుండి వెళ్ళిపోవటమే మేలు" అంటూ, ఆమెకు కృతజ్ఞత తెలిపి, ఆ క్షణమందే ఊరు విడిచి వెళ్లిపోయాడు.

తరువాత, కొద్దిరోజులకల్లా సువర్ణమాల భర్త ఇంటికి తిరిగివచ్చాడు. సువర్ణమాల చక్కదనానికి అసూయపడిన వాళ్లలో ఒక మంగలిపడుచు ఉన్నది. అది పనికట్టుకపోయి అతనితో "అయ్యా! మీరు వూరు వెళ్ళగా చూచి ఎవరో ఒకాయన వచ్చినారండి. ఆయన ఉన్నన్నాళ్లూ అమ్మగారు నానా చాకిరీచేసి శ్రమపడ్డారండి" అని చెప్పి వూరుకుంది.

బ్రాహ్మడు రౌద్రాకారం తాల్చాడు. భార్యను పిలిచి అడిగాడు. 'మనిషి వచ్చినమాట వాస్తవమే'నంటూ ఆమె క్షత్రియ వీరుణ్ణి గురించిన సంగతి అంతా పూసగుచ్చినట్లు చెప్పింది. బ్రాహ్మడు నమ్మలేదు. సువర్ణమాల అగ్నిజ్వాలలో చేయిపెట్టి శపథంచేసింది. అయినాసరే, అతనికి ఎంతమాత్రమూ నమ్మకం కలగలేదు.

'దీనికి తగిన ప్రాయశ్చిత్తం ఇదే'నంటూ, ఆమెను ఒక అడవికి తీసుకపోయి, చెట్టుకుకట్టి, కాళ్లూచేతులూ ఖండించివేసి, చిత్రవధచేసి చంపాడు.

ఈ సంగతి తెలియగానే, ఆ క్షత్రియవీరుడు కోపంపట్ట లేక ఉగ్రుడై, నిప్పులుపెట్టి హాతో వచ్చి 'ఓయీ!—బ్రాహ్మణ జన్మ ఎత్తినావే కానీ, నిజానికి నీవు రాక్షసుడివి. నీభార్య గొప్ప యోగిని, మహాపతివ్రత అని తెలుసుకోలేకపోయావు. అటు వంటి ఉత్తమ ఇల్లాలిని ముల్లోకాలలోనూ చూడలేము.

చంద్రునికైనా ఒక మచ్చవున్నది కాని, ఆ మహాయిల్లాలికి ఎటువంటి కళంకమూ లేదు. అలాటి శీలవతినీ పుణ్యవతినీ శంకించి, వివేకంలేకుండా పొట్టను పెట్టుకొని పాపం కట్టుకున్నావే; నిన్నేమిచేయాలె! మహాపాపివైన నీకు చావుకంటే బ్రతికివుండటమే గొప్ప శిక్ష. అందుకనే, నిన్ను వధించకుండా వదిలేస్తున్నాను' అని చెప్పి వెళ్లిపోయాడు.

అప్పుడు బ్రాహ్మడికి స్మృతి వచ్చింది. నిజానిజాలు బయల్పడగానే తనను తా తెలుసుకొన్నాడు. తొందరపాటుకు దుఃఖించాడు. పశ్చాత్తాపం పొందాడు. ఇంకిప్పుడు పశ్చాత్తాపం పొంది లాభమేముంది! అందుచేత విరాగి అయి, కాశీ చేరుకుని, గంగవొడ్డున తపస్సుచేసుకోబోయాడు.

'అయ్యో!—నా మూలానకదా, నిష్కారణంగా పండు వంటి కాపరం కూలిపోయింది. ఉపకారానికి పోయిన ఆ మహాయిల్లాలికి మరణం సంప్రాప్తమయింది. అమాయికుడైన ఆ బ్రాహ్మడు అక్కుపక్షి ఐపోయాడు!' అనుకుంటూ, జరిగిన ఘోరాలన్నీ తలుచుకు తలుచుకు, కుమిలి కుమిలి, ఆ క్షత్రియ వీరుడు, చేతనున్న ఖడ్గంతో పొడుచుకు చచ్చాడు.

రాజకుమారీ!—నిష్కళంక ఐన ఆ యిల్లాలికి విధి అంతటి కఠోర శిక్ష ఎందుకు విధించవలసివచ్చిందో!" అని ప్రశ్నించి మౌనం వహించాడు, ధీనిధి.

అప్పుడు చంద్రకళాదేవి: "మోక్షమార్గం చూపించాలెనంటే అందుకు అర్హత కలవాళ్లేకద ముందుకు రావాలి? బంగారాన్ని పరీక్షచేయాలంటే దానికి అగ్నిస్పర్శ కలగకుండా ఎలా తప్పుతుంది? ఇందుకు సువర్ణమాల అర్హురాలు గనుకనే అటు

వంటి కఠినమైన అగ్నిపరీక్షకు నిలిచింది. తను ఆహుతిఅయి తన ఉత్తమ శీలాన్ని ప్రపంచానికి చూపి, మార్గదర్శకురాలైంది. ఆమె శీలమే లోకానికి ముక్తిమార్గము. ఇదే ఆమె త్యాగానికి తగిన ప్రతిఫలం. ముక్తి ఇటువంటి త్యాగాలవల్లనే వస్తుంది కాని, మరణించినమాత్రానే రాబోదని నిరూపిస్తున్నది సువర్ణమాల చర్య" అని అంటూ, ఆమె శిలావేదికమీదినుంచి లేవబోతూ వుండగా, "నిజం! నిజం!!" అని దిక్కులు పిక్కటిల్లేటట్టుగా పలికింది, ఆకాశవాణి!

మిలమిల మెరిసే కన్నులతో రాజకుమారి, రాజును చూస్తూ వెళ్లిపోయింది. రాజు హృదయం ఆమె వెనుకనే పరుగెత్తింది. శరీరంమాత్రం ధీనిధితోపాటు బస చేరుకున్నది.

బసకు వచ్చేక రాజు ధీనిధిని చూసి 'మిత్రుడా! ఈ రోజుకూడా నీయత్నం వ్యర్థమైపోయింది. నాల్గవరోజూ గడచిపోయింది. దీనికి నిన్ను క్షమించకూడదు. అయినా రాజకుమారి తన కన్నుల తళతళకాంతులు నామీద ప్రసరించడంచేత, ఆ ఉపకారాన్ని తలిచి నిన్ను క్షమించాను. నల్లకలువల్లోంచి మంచు కిరణాలు వ్యాపించినట్లు ఆమె చూపులు నాహృదయానికి చల్లదనం కలిగించాయి. ఆమె చిత్రమే లేకపోతే నేను రాత్రి వేగించడం జరగదు.' ఇలా అంటూ, ఆ చిత్రం చూస్తూనే రాత్రంతా గడిపాడు.

---

# ఐదవ రాత్రి



మరునాడు హేమప్రభుడు ఉదయానే లేచి, నిత్యకృత్యాలు నిర్వర్తించుకుని, పగలల్లా మిత్రుడితో ఎంతో కష్టంమీద గడిపి సాయంత్రం అయేసరికి చంద్రకళాదేవి ఉద్యానవనానికి వెళ్ళాడు. ధీనిధి అతని వెంబడే ఉన్నాడు. వారు అక్కడికి వెళ్లేసరికే రాజకుమారి శిలావేదికమీద ఆసీనురాలై వున్నది. నాడు ఆమె ముదురుఎరుపురంగు చీర కట్టుకుంది. రకరకాల రంగులతో ప్రకాశించే విమలాలనే రత్నాలు కుట్టిన రవిక తొడుక్కొని వుంది. రాజు వస్తూవున్నప్పుడే ఆమె అతన్ని నిదానించి చూడసాగింది. ఆమె చూపులకు ముగ్ధుడై హేమప్రభుడు శిలావేదికమీద కూలబడ్డాడు. ధీనిధి రాజకుమారి ముందుకు వచ్చి నిలబడి ఇలా అన్నాడు—

"రాజపుత్రీ! ఒకరాజుకు ముగ్గురు భార్యలుండేవారు. వారు ముగ్గురూ సాటిలేని అందకత్తెలు. ఆ రాణులు ముగ్గురూ ఏ విషయంలోనూ ఒకరికొకరు ఈడుమతియ్యకుండా మహారాజును సంతోషపెట్టేవారు. ఆ రాజు తన రాణులతో కూడి పున్నమరాత్రులలో డాబామీద విహరించేటప్పుడు వారి వదనాలనూ, ఆకాశంమీది చంద్రుణ్ణీ విడదీసి నిర్ణయించడానికే వీలుకాకుండా వుండేది.

ఒకనాటి వేసవిరాత్రి రాణులు ముగ్గురూ నిద్రపోతూ వుండగా రాజుమాత్రం మేలుకొనే వుండె. నిండు వెన్నెలలో

ప్రకాశిస్తున్న వారి ముఖాలు చూచి, రాజు ఆ ముగ్గురిలోనూ ఎవతె మిక్కిలి అందకత్తె అయినదో నిర్ణయించాలనుకున్నాడు. ఆతడు ఒక రాణిదగ్గరికి వెళ్లి పరిశోధించాడు. ఆమె వెల్లకిలా పడుకొని వుంది. పండువెన్నెల ఆమెపై ప్రసరించి శోభను కలుగజేస్తూవుంది. ఆమె ఒకచెయ్యి తలమీదుగా చాచుకొని వుంది. మందమారుతం వీస్తూ అప్పుడప్పుడు ఆమె పైటను అటుఇటు తొలగిస్తూ వుంది.

రాజు మరొక రాణిదగ్గరకు వెళ్ళాడు. ఆమె ఒక పూల పందిరికింద శయనించివుంది. ఆమె ముఖంమీద వెలుగు, నీడలు తాండవిస్తూ వింతశోభను కలిగిస్తూ వుండినవి.

మూడవ రాణి నీడలో నిద్రిస్తూ వుంది. వెన్నెల కొంచెంగా ఆమె చెవిమీదమాత్రం పడి ఒక వింత అందాన్ని కలిగిస్తూ వుండింది. ఈ ముగ్గుర్నీ చూసి, ముగ్గురిలో ఎవర్తె మిక్కిలి అందమైనదీ రాజు నిర్ణయించలేకపోయాడు. ఎన్నో సార్లు ఆ ముగ్గుర్నీ పరిశోధించాడు. కాని, కనిపెట్టలేకపోయాడు. రాత్రంతా ఇలాగే రాజుకు నిద్రలేకుండా గడచిపోయింది.

మరునాడు మామూలుగా రాజు సభాభవనానికి వెళ్ళుతూ వుండగా, అతని మంత్రి ఎదురై నమస్కరించి, రాజు కన్నులు చింతనిప్పుల్లా వుండడం గమనించి "ప్రభువువారికి రాత్రి నిద్రలేనట్లున్నదే; ప్రభువుల నేత్రాలు ఎర్రబారి ఆ విషయం చెప్పకనే చెబుతున్నాయి" అన్నాడు.

అందుకు రాజు తనకు నిద్రలేకపోవడం నిజమే అనిన్నీ, తన రాణుల్లో ఎవర్తె ఎక్కువ అందకత్తె అయినదో తెలిసికోవ డానికి ప్రయత్నించీ విఫలుడనైనాననిన్నీ ఉన్నది ఉన్నట్లు

వివరంగా తెలిపాడు.

అప్పుడు మంత్రి 'ప్రభూ! పరస్పరమూ భేదం చూప డానికి వీల్లేని అందకత్తెలు రాణులుగా లభించినందులకు ప్రభు వులు ఎంతో అదృష్టవంతులు! వ్యత్యాసం చూపడానికి ప్రయ త్నించడంవల్ల ప్రయోజనం వుండదు. మీదుమిక్కిలి ఉత్త రోత్తరా మనస్సుకి బాధకూడా కలగవచ్చు' అన్నాడు.

కాని ఎలాగన్నా ఈసమస్యని పరిష్కరించే తీరాలంటూ రాజు పట్టుదల పట్టాడు. ఈ విషయంలో ఉపాయం ఆలోచించి తీరాలని మంత్రికి ఆజ్ఞయిచ్చాడు.

రాజుకు పట్టిన యీ పట్టుదల చూసి మంత్రి "ప్రభూ! మంత్రులు పెంకెగుర్రాలపై స్వారిచేసేవారి వంటివారు. ఎలా గన్నా, ఆలాటి గుర్రాన్ని దారిలో పెట్టకపోతే అపాయం తప్పదు. ఇందుకు చాలా ధైర్యసాహసాలూ, జాగ్రత్తా కావాలి. ఇప్పుడు ప్రభువులు ఆదేశించిన పనులు ఆ గుర్రాల లాంటివి. ఐనా చేసితీరవలసిందే! తమరు రాణుల చక్కదనం లోని తారతమ్యం కనిపెట్టడానికి ఒకమార్గం వుంది. మన పట్ట ణానికి యీమధ్యనే కాంతిగ్రహుడనే ఒక బ్రాహ్మణుడు వచ్చాడు. సౌందర్యాన్ని నిర్ణయించడంలో ఆయన ప్రతిభాశాలి. ఈ విషయంలో మూడులోకాల్లోనూ అతన్ని మించినవాడు లేడట. అతన్ని రప్పించి రాణులను చూపినట్లయితే మీ సమస్య పరిష్కారం కావచ్చు. హంస సయితం పాలనూ, నీళ్ళనూ వేరుచేయలేక పోవచ్చునేమోగాని, అతడుమాత్రం చక్కదనం లోని భేదాన్ని స్పష్టంగా చెప్పగలడు" అని మనవిచేశాడు.

మంత్రి చెప్పిన సలహాను అనుసరించి రాజు కాంతి

గ్రహుణ్ణి వెదకించి తెప్పించాడు. మంత్రిచేసిన ఏర్పాటుప్రకారం రాజు కాంతిగ్రహుడితో మాట్లాడుతూ వుండగా రాణులు ముగ్గురూ ఒకరి తర్వాత ఒకరు నడచి వెళ్లేటట్లుగా యేర్పాటు జరిగింది.

మొదటి రాణి వెళ్లిపోయినప్పుడు కాంతిగ్రహుడు తల వంచుకొన్నాడు. రెండవరాణి వెళ్లినప్పుడు కొంచెంగా చలించాడు. కడసారి రాణి వెళ్లినప్పుడు అతని ముఖంలో రంగే మారింది. ముగ్గురూ వెళ్లిపోయాక రాజు ఆ ముగ్గురిలోనూ ఎవర్తె ఎక్కువ అందకత్తె అయినదీ చెప్పాలని కాంతిగ్రహుణ్ణి అడిగాడు.

కాంతిగ్రహుడు తనలో ఇలా ఆలోచించుకొన్నాడు: "మహారాజు యీ ముగ్గురిలోనూ ఎవరిని ఎక్కువగా ప్రేమిస్తున్నదీ నాకు తెలియదు. నేను యథార్థం చెప్పివేస్తే - ఆయనకు ప్రియురాలు అయిన రాణిని అగౌరవపరచినట్లవుతుందేమో! రాజుతో యథార్థం చెప్పినా చెప్పకపోయినా ఎప్పుడో ఒకప్పుడు యీ సంగతి బయలుపడక తప్పదు. అప్పుడు తక్కిన రాణులిద్దరికీ నామీద కోపంకలిగి, విష ప్రయోగం చేయించిగాని-మరో విధంగాగాని నన్ను హతమార్చవచ్చును. కనుక, ఇప్పటిమట్టుకు ఏమీ చెప్పకుండా తప్పించుకొనిపోవడమే మేలు."

అతడిలా ఆలోచించి "ప్రభూ! నిర్ణయించడానికి నాకు కొంత వ్యవధి కావాలి. రేపు తప్పక తెలియజేస్తాను" అని చెప్పి సెలవు తీసుకొని మెల్లిగా వెళ్లిపోయాడు. అతడు ఆ సాయంత్రం లోగానే ఊరు విడిచి వెళ్లిపోవాలని మొదట అనుకున్నా,

ఆ ముగ్గురు రాణుల్లోనూ ఒకామె సౌందర్యం తనను ప్రబలంగా ఆకర్షించడంచేత ఊరువిడిచి వెళ్లిపోదామంటే అతనికి బుద్ధి పుట్టిందికాదు.

ఆ రాజువద్దనుండే మంత్రి అసాధ్యుడు. ఆకార, వికారాలను బట్టి, మనస్సులోని అభిప్రాయం సుళువుగా గ్రహించగల సమర్థుడు. అతడు రాజుతో ఇలా అన్నాడు.—"ప్రభూ! ఆ బ్రాహ్మణుడు తప్పించుకొని పోవడానికే యిలా ఎత్తు ఎత్తాడు. ఏం చెబితే ఏమి ఉపద్రవం వస్తుందో అని అతను భయపడ్డాడు. సాయంత్రంలోపుగా అతడు ఊరువిడిచి వెళ్లిపోవచ్చు. రాణుల్లో ఎక్కువ అందకత్తె ఎవ్వరైనదీ తెలుసుకోవడానికి నేనిప్పుడు ఒక ఉపాయం మనవిచేసికొంటాను" అన్నాడు.

మంత్రి సలహాను అనుసరించి రాజు కాంతిగ్రహుడి మనసులోని అభిప్రాయం తెలుసుకున్నాడు. అతని అభిప్రాయం ప్రకారం ఎక్కువ అందకత్తెగా నిర్ణయింపబడిన రాణినే ఎక్కువగా ప్రేమించి, తక్కిన ఇద్దరినీ అలక్ష్యం చేయసాగాడు. అందుచేత తక్కిన రాణులిద్దరూ కూడబలుక్కొని రాజుకు యిష్టురాలుగా వున్న మూడవరాణిని విషంపెట్టి చంపించారు. ఈ సంగతి తెలుసుకుని రాజు, కోపంతో ఆ యిద్దరు రాణులనీకూడా చంపించివేశాడు.

ఇలా, అందకత్తెలయిన ఆ ముగ్గురు రాణులలోనూ ఒక్కర్తెకూడా రాజుకు దక్కలేదు. ఈ విధంగా జరుగుతుందని మంత్రికి మొదటనే తెలుసు.

ఐతే, రాజకుమారీ! తన రాణులలో ఎక్కువ అందకత్తె

ఎవరై నదీ కాంతిగ్రహుడి మూలంగా రాజు ఎలా తెలుసుకో గలిగాడో!" అని ప్రశ్నించి, వూరుకున్నాడు ధీనిధి.

చంద్రకళాదేవి యిలా చెప్పింది: "ఈ విషయం తెలుసు కోవటానికి ఏమంతగా ప్రయత్నం చెయ్యనక్కరేలేదు. కడసారి రాణియే అందరిలో అందకత్తె. ఎలా అంటే — మొదటిరాణి చక్కదనం కాంతిగ్రహునికి దిగ్భ్రమమాత్రం కలిగించింది. కాబట్టే అతడు తలవంచుకు ఊరుకున్నాడు. రెండోరాణి చక్కదనం అతన్ని ఆకర్షించినా - భీతినికూడా కలిగించింది. అంచేతనే ఆమెను చూడగానే చకితు డయ్యాడు. కడసారి రాణి చక్కదనం అతని మనస్సును బాగా ఆకర్షించింది. దాన్ని యిత రులు గ్రహిస్తారేమో అనే అనుమానంచేత అతని రంగే మారింది.

ఈ సంగతి మంత్రి గ్రహించకపోలేదు. అయినా తన ఊహ నిశ్చయమవునో కాదో స్పష్టం చెయ్యడానికి మంత్రి ప్రయత్నించాడు. కాంతిగ్రహుడి ఆకార వికారాదులనుబట్టి అతడు చాపల్యం కలవాడని గ్రహించాడు. రాణులు ముగ్గురూ, అతన్ని ప్రేమించినట్టూ, తమను కలుసుకోవడానికి తగిన సమ యాన్నీ చోటునూ నిర్ణయించినట్టూ తెలుపుతూ, కాంతి గ్రహుడికి దొంగవుత్తరాలు వ్రాయించి, అవి అతనికి రహ స్యంగా అందేటట్లు ఏర్పాటు చేశాడు. అయితే, నిర్ణయించిన సమయం మాత్రం ముగ్గురకూ ఒక్కటే అయేటట్లు జాబుల్లో వ్రాయించాడు.

మూడోరాణి ఎక్కువ అందకత్తె కాబట్టే ఆమెను కలుసుకోవడానికే నిశ్చయించి, కాంతిగ్రహుడు చెప్పిన గడు

వులో చెప్పినచోటుకు వెళుతూ వుండగా, దారిలో దాగివున్న రాజభటులు అతన్ని పట్టివేస్తారు. ఇందువల్ల రాణులు ముగ్గురిలో ఎవర్తె ఎక్కువ అందకత్తె ఐనదీ తేలిపోయింది. మనుష్యుల మాటలకన్నా, వారు చేసే పనులే ఏ విషయాన్నయినా నిర్ణయించడానికి తగివుంటాయి.''

ఇలా అంటూ, రాజకుమారి హేమప్రభుడివైపు విచార దృక్కులు ప్రసరింపజేస్తూ వెళ్లిపోయింది. రాజుమనస్సు ఆమెను వెంబడించింది. శరీరంమాత్రం ధీనిధితోపాటు నెమ్మదిగా బస చేరుకుంది.

విడిదికి వచ్చాక రాజు ధీనిధిని చూసి ''ధీనిధీ! ఈరోజు కూడా చంద్రకళ నీ సమస్యకు సమాధానం చెప్పివేసింది. ఐదవ రోజుకూడా వ్యర్థంగా గడిచిపోయింది. నిన్ను క్షమించడానికి వీల్లేదు. అయినా నువ్వు చెప్పిన కథమూలాన్ని నా్రవేయసి తన అద్భుతమైన తెలివితేటలు చూపడంచేత నిన్ను క్షమించాను. ఆమె స్త్రీరూపంతో వున్న బృహస్పతిలా కనబడుతూ వున్నది. ఆమె వెళ్లిపోతూ పోతూ నామీద విసిరిన చూపు నా హృదయాన్ని మిక్కిలి బాధపెడుతూ వున్నది. ఆమె చిత్రం నాదగ్గర వున్నా, ఆమెను గురించిన విరహంతో యీ రాత్రి ఎలా గడపగలనో తెలియకుండా వుంది.'' ఇలా అంటూనే, ఆమె చిత్రం చూస్తూ రాత్రి అంతా విశ్రాంతి లేకుండానే వేగించాడు.

# ఆరవ రాత్రి



మరునాడు సూర్యోదయం కాగానే హేమప్రభుడు లేచి, ధీనిధితో కూడా ఆ తోటలో తిరుగుతూ పగలల్లా కాలక్షేపం చేసి, సాయంత్రం కాగానే చంద్రకళాదేవి దగ్గరకు వెళ్లాడు. మిత్రులిద్దరూ వెళ్లేసరికే ఆమె ప్రశ్నకోసం ఎదురు చూస్తూ శిలావేదికమీద కూర్చునివుంది.

ఆ దినం ఆమె నీలవర్ణపు చీరధరించి, స్ఫటికాలు కూర్చిన రవిక తొడుక్కుని, ఆ దుస్తులకు అనుకూలాలైన నగలూ, కిరీటమూ ధరించివుంది. రాజును చూడగానే ఆమె ఒక నిట్టూర్పు విడిచింది. అది గమనించి అతడు కుంగిపోయి శిలావేదికమీద కూలబడి, ఆమెవైపే నిదానించి చూస్తూవుండగా - ధీనిధి వచ్చి రాజకుమారియెదుట నిలిచి యిలా ప్రారంభించాడు—

"రాజకుమారీ!- ఒకానొకప్పుడు ఒక వూళ్లో ఒక జూదగాడు వుండేవాడు. వాడు జూదగాడే కాదు, మోసగాడు కూడాను. వాడు తన ఆస్తినంతా జూదంలో పోగొట్టుకొని జీవనంకోసం సన్యాసివేషం వేశాడు. ఆ మోసగాడు ఒంటినిండా బూడిద పూసుకుని, నడినెత్తిని జుట్టు ముడివేసి, పునుకలపేరు మెడలో ధరించి, కావిగుడ్డ కట్టి, దండకమండలాలు చేత పుచ్చుకుని అసలైన సన్యాసిలాగే తయారయ్యాడు. ఎవరన్నా తనవేపు చూసినపుడల్లా దొంగజపం చేస్తూ, నటన చేయ సాగాడు.

ఒకనాడు ఆ మోసగాడు బాటపక్కన కూర్చుని వుండగా ఆ వూరి రాజకుమారుడు ఏనుగుమీద అంబారీలో ఆ దారంట వెళ్ళడం సంభవించింది. వాడున్న చోటికి ఏనుగు వచ్చే సరికి అంబారీకి కట్టివున్న తెర గాలికి ఎగిరింది. ఆ సమయంలో రాజకుమారి ఆ మోసగాడి కంటబడింది. ఆ కపటసన్యాసి ఆమె చక్కదనానికి ముగ్ధుడై పోయాడు. జన్మ ఎత్తినందుకు అలాంటి చక్కని చుక్కను చేపట్టకపోతే యేమిటని వాడికి తోచింది. తోచిందే కాని, రాజకుమారిని లొంగదీసుకోవడం మాటలా ?

వాడు చాలాసేపు నిదానంగా ఆలోచించాడు. రాజ భవనానికి ఎదుటవున్న ఒక చెట్టుకొమ్మని కాళ్ళతో పట్టుకొని తలకిందుగా గబ్బిలంలాగు వేలాడుతూ తపస్సు చేస్తున్నట్టు నటించాడు. వాడి వాలకం చూచి, ఇతడు గొప్ప మునీశ్వరుడంటూ ప్రజలు గుంపులు గుంపులుగా వచ్చి మూగారు. రోజూ కొంత సేపు ఇలా తలకిందులా వేలాడేవాడు ఆ మోసగాడు.

ఈ సంగతి పోయిపోయి రాజుగారి చెవినికూడా పడింది. ఆయన స్వయంగా వచ్చి చూచి, ఇతడు మహాత్తుగలవాడే అని నమ్మి పళ్లూ, పాలూ తెప్పించి యిస్తూ, ఆ సన్యాసివల్ల దీవనలు పొందుతూ వుండేవాడు.

రాజకుమార్తె పేరు హాసన్ముఖి. పేరుకు తగినట్లే ఆమె తరుచు నవ్వే స్వభావం కలది. ఆమె ఒకనాడు ఏనుగుమీద అంబారీలో కూర్చుని వెళ్తూ, రాజభవనం ఎదుట ఈ దృశ్యం చూడటం తటస్థించింది. చెట్టుకొమ్మకి తలక్రిందుగా వేలాడుతున్న ఆ సన్యాసిని చూడగా వచ్చిన నవ్వు ఆపుకోలేక ఆమె

గట్టిగా నవ్వింది. ఆ నవ్వు సన్యాసికి బాగానే వినబడింది.

అతను కోపంతో వెంటనే చెట్టునుంచి దిగి రాజుదగ్గరికి పోయి: "రాజా! నీ కుమార్తె నన్నుచూసి నవ్వి, నా తపస్సుకి విఘ్నం కలిగించింది. నీ కుమార్తె కాబట్టి ఈసారికి శపించకుండా క్షమిస్తాను. పూర్వం అయితే - ఋషులంతా - అపరాధంచేసిన వారిని ఘోరంగా శపించేవారు!- నీ ముఖం చూసి నేను ఆమెను క్షమించినా - నీ రాజ్యంలో ఇరవై యేళ్ళ దాకా వర్షం పడకూడదని శపించాలని నిశ్చయించుకున్నాను" అన్నాడు.

ఈ మాట వినేసరికి రాజు గడగడలాడిపోయాడు. ఈ అపరాధం క్షమించాలంటూ చాలా ప్రాధేయపడ్డాడు.

దొంగసన్యాసి కొంత దయతలచినట్లు నటించి: "సరే!- యీసారికి నా శాప యత్నాన్ని మానుకుంటాను. ఇలాటి అపచారం ఇకమీద జరక్కుండా మాత్రం చూడు" అని చెప్పి మళ్లీ చెట్టుదగ్గిరికి వెళ్లిపోయాడు. రాజు కుమార్తెను పిలిచి జాగర్తగా వుండాలని హెచ్చరించాడు.

మరుచటి దినం మళ్ళీ రాజకుమారి ఏనుగుమీద వెళుతూ, గత దినం సంగతి మరిచిపోయినట్టే ఆ వింతసన్యాసిని చూసి, మునపటికన్నా గట్టిగా, ఎక్కువసేపు నవ్వింది. సన్యాసి మిక్కిలి కోపంతో చెట్టుదిగి రాజుదగ్గిరికి వెళ్లి గట్టిగా బెదరించాడు. రాజు గడగడలాడుతూ క్షమించాలని చాలసార్లు బతిమాలుకొని, సన్యాసిని శాంతపరిచి పంపివేశాడు. తన కుమార్తెను మళ్లీ చీవాట్లు పెట్టాడు.

తరవాత రెండురోజులపాటు వాసన్నొంఖి మరిఒక

మార్గంగా విహారానికి వెళ్లింది. కాని, మూడోరోజున కూడా మరిచిపోయినట్టే, యథాప్రకారం చెట్టుదగ్గర్నుంచి పోతూ, సన్యాసిని చూచి పెద్దగా నవ్వింది. ఆమె ఈ రోజున చాలాసేపు నవ్వింది. అంతఃపురంలోకి వెళ్లే వరకూ ఆమె తన నవ్వు ఆపుకోన లేకనేపోయింది.

కపట సన్యాసి వెంటనే చెట్టుదిగి, రాజుదగ్గరికి పోయి "రాజా! నీ కుమార్తె నేడు చాలాసేపు విపరీతంగా నన్ను చూసి నవ్వి, పళ్ళతరబడి నేను చేస్తూవున్న తపస్సుకి విఘ్నం కలిగించింది. ఇక నేను నీ రాజ్యాన్ని శపించకుండా వుండలేను" అన్నాడు.

రాజు గడగడలాడిపోతూ, 'యోగివర్యా!- త్రికాలజ్ఞులయిన మీకు తెలియనిది వుండదు. ఆమె అలా ఎందుకు నవ్వుతున్నదో సెలవీయగలరా?' అని అడిగాడు.

సన్యాసి ఆలోచించినట్లు నటిస్తూ, 'ఆమెను హాస పిశాచం అనే భూతం ఆవేశించివుంది. అంచేత ఇలా ఆమె నవ్వుతూవుంది' అని చెప్పాడు.

'అయితే, దాన్ని వదిలించడానికి మార్గంలేదా?' అన్నాడు రాజు. అందుకు కపటసన్యాసి 'లేకేమి? నాకు మీ కుమార్తెను చూపిస్తే మంత్రం వేస్తాను. నేను శాయ శక్తులా ప్రయత్నిస్తాను. ఐతే, ఆ పిశాచం పోనూ వచ్చు, పోక పోవనూ వచ్చు. పోకపోతే నీ రాజ్యాన్ని శపించడం యెలాగూ వుండనేవుంది' అన్నాడు.

రాజు ఆ సన్యాసిని తన కుమార్తెదగ్గిరికి తీసుకొనివెళ్లి 'అమ్మాయీ! వీరు మహాత్ములు! నిన్ను ఆవేశించివున్న హాస

పిశాచాన్ని వదలగొట్టాలని నేను ప్రార్థించగా దయతలచి వచ్చారు. నువ్వు మంత్రం వేయించుకోవాలి. లేకపోతే - నా రాజ్యంలో ఇరవై యేళ్ళపాటు వానలు పడక, రాజ్యం నశించి పోతుందిట' అని ఆమెతో అన్నాడు. రాజపుత్రిక మౌనం వహించింది.

అప్పుడు కపట సన్యాసి 'మంత్రం వేసేటప్పుడు ఎవళ్లూ ఆ చుట్టుపట్ల వుండకూడదు. రాజకుమారి వుండే గదిలో ఆమే, నేనూ మాత్రమే వుండాలి. ఆ చుట్టుపక్కల జనం అలికిడే వుండకూడదు. లేకపోతే మంత్రం పారదు' అన్నాడు.

ఇదంతా ఏదో మోసంగా వుందని రాజకుమారికి తోచింది. 'ఈ సన్యాసి మోసగానివలె ఉన్నాడు. నా తండ్రి అమాయకుడై వీడి వలలో పడిపోయాడు. వీడికి తగిన ప్రాయశ్చిత్తం చేయాలి. ఈసారి నవ్వడంతో నా పని ముగించను' అని ఆమె అనుకుంది.

రాజు తన కుమార్తెను ఒంటరిగా విడవడానికి సందేహిస్తూ వుండగా, ఆ సన్యాసి "సందేహించ నక్కర్లేదు. మేము మానవాతీతులం. ఆమె నాలుగడుగుల దూరంలో వుండగానే మంత్రం వేస్తాం" అన్నాడు. అప్పుడు రాజకుమార్తె కూడా అందుకు అంగీకరిస్తూ, "నాన్నగారూ!- భయంలేదు. ఆయన చెప్పినట్లే జరిగించవచ్చు" అన్నది. తర్వాత మంత్రం వెయ్యడానికి తగిన యేర్పాట్లన్నీ జరిగాయి.

హాసన్ముఖి యెవ్వరికీ తెలియకుండా కొంతమంది చెలికత్తెల్ని పక్కగదిలో రహస్యంగా వుంచింది.

రాజకుమారి గదిలో ఆమే, మాంత్రికుడూ తప్ప మరె

వ్వరూ లేరు. ఒంటిపాటుగా రాకుమారిని చూడగానే సన్యాసికి ఉద్రేకం కలిగింది. అయినా తొందరపడలేదు. వలయాకారంగా పెద్దగీత గీసి, దానిమధ్యని ఆమెను నిలబెట్టి, ఏవో మాటలు గొణిగాడు. తర్వాత 'చెవిలో చెప్తేనేగాని మంత్రం పారదని అంటూ, ఆమెని దగ్గరకు రమ్మన్నాడు. హాసన్ముఖి వెళ్ళలేదు. 'నువ్వు నా దగ్గరికి రాకపోతే నేనే నీ దగ్గరికి వస్తా'నంటూ ఆ దొంగసన్యాసి గబగబా వెళ్లి ఆమె చేతిని పట్టుకున్నాడు.

ఆమె మెల్లగా చెయ్యి విదిలించుకుని చప్పట్లు చరిచేసరికల్లా పదిమంది చెలికత్తెలూ వచ్చి సన్యాసిని పట్టి, వాడి వళ్లు హూనం చేశారు. ఒకర్తె ఎర్రగా కాల్చివుంచిన గరిటె తెచ్చి, వీపుమీద రెండ్లు చురకలు కూడా పెట్టింది. అప్పుడు హాసన్ముఖి 'దయతలచి నిన్ను ప్రాణాలతో విడుస్తున్నాను. పో! కావాలంటే మా నాయనతో చెప్పుకో. నిన్ను డొక్క చీల్పిస్తా' అన్నది. ఆ సన్యాసిని చెలికత్తెలు ఆమట్టున వదిలేశారు.

వెంటనే వాడు గట్టిగా నవ్వుకుంటూ ఆ భవనంనుంచి బయటపడేసరికి రాజోద్యోగులు కనబడ్డారు. కపటసన్యాసి వాళ్ళ వెంబడే రాజుదగ్గరికి పకపక నవ్వుతూ పోయి "రాజా!– ఇక భయంలేదు. నీ కుమార్తె హాసపిశాచం ఆమెను విడిచి వేసింది. దాన్ని నామీద ఆవహింపజేసుకొని, నాకూడా తీసుకపోతున్నాను' అంటూ, చావు మూడిందనే గుండెబెదురున్నప్పటికీ, నవ్వుతూనే వెళ్లిపోయాడు.

రాజకుమారీ!– ఆ కపటసన్యాసి అలా నవ్వుతూ వెళ్లిపోవటానికి కారణం 'యేమిటైవుంటుందో!" అని, వూరుకున్నాడు ధీనిధి.

రాజకుమారి కొంచెం ముఖం చిట్లించుకొన్నది. "మృత్యువు నోటినుండి తప్పించుకున్నట్టుగా, ఆ చెలికత్తెల నుండి తప్పించుకొని ప్రాణాలతో బయటపడ్డానని కులుకుతూ, ఆ మోసగాడు తన పిరికితనానికి తగినట్టుగానే నవ్వాడు. 'అయ్యో!- నా ప్రయత్నం విఫలమైపోయిందే, చెలికత్తెల చేతుల్లో చావుదెబ్బలు తిన్నానే, శాశ్వతమైన గురుతులుగా వుండేటట్టు చురకలుకూడా పడినయే, తలకొట్టినంత పని జరిగిందే!' అనే తలంపే లేకపోయింది. ఈ అన్నిటికన్నా వాడు తన ప్రాణమే ఎక్కువగా, ఎలాగో అలా బతికివుండటమే ఘనంగా ఎంచుకున్నాడు. బ్రతుకు ఎంత నీచమైనప్పటికీ పిరికి పందలకు ప్రాణమే తీపి. చెప్పుదెబ్బలు తగిలినా ప్రాణరక్షణే వాళ్ళకు పరమావధి. వాడు అలా నవ్వుతూ, హాసపిశాచాన్ని వెంట తీసుకపోతున్నట్టు నమ్మించి నటించకపోతే, వాడిని రాజ కుమారి విడిచినా రాజు విడిచేవాడుకాడు. ఏదోవిధంగా అసు వులు నిలబెట్టుకుని ఈ సన్యాసిలాగ నీచపు బతుకు బతుకుతారు పిరికిపందలు. ఆత్మగౌరవం కలవారు ప్రాణాన్ని తృణప్రాయంగా చూస్తారు. తాము తలపెట్టిన ఏపాటి చిన్న ఉద్యమమైనా సరే, విఫలం కావటాన్ని వారు సహించలేరు. అది ఒక గొప్ప అవ మానంగానూ, మరణంకంటె కూడా ఎక్కువగానూ వారు భావిస్తారు" అని. అంటూ, భావగర్భితమైన ఒక్క చూపు విసరి, లేచి వెళ్ళిపోయింది.

రాజు మనస్సు ఆమె వెనకాలే పరుగెత్తింది. శరీరం మాత్రం ధీనిధితోపాటు మెల్లగా విడిది చేరుకుంది.

బసకు వచ్చాక రాజు మిత్రుడిని చూసి "మిత్రుడా!

ఈ రోజుకూడా నీ ప్రయత్నం ఫలించలేదు. మన గడువు దినాల్లో ఆరు రోజులు గడచిపోయాయి. ఈ అపరాధానికి నిన్ను క్షమించరాదు. కాని, చంద్రకళ పోతూపోతూ, సాభిప్రాయ దృష్టిని నామీద విసరడంచేత - ఆ వుపకారం తలిచి, నిన్ను క్షమించాను. ఆమె ముఖం చిట్లించుకున్నప్పుడు - సరస్సుమీది చిన్న కెరటంలా ఆ చిట్లింపు నన్నెంతో ఆకర్షించింది. ఆమె మాటలు నాకు కొంత ప్రోత్సాహాన్నీ, ఆశనీ కలిగించాయి. అయినా ఆమె తెలివితేటలు సాటిలేనివి. ఆమె ప్రతిభ చూడగా ఆమె నాకు దుర్లభురాలయేటట్లు కనబడుతూవుంది. ఆమెచిత్రాన్ని చూస్తూ కూడా, ఆమె వియోగాన్ని రేపటి దాకా సహించి ప్రాణాలు నిలుపుకోవడం దుర్భరంగా వుంది" అంటూ, ఆమె చిత్రాన్ని చూస్తూ, హృదయ సంక్షోభం తోనే రాత్రంతా గడిపాడు.

# ఏడవ రాత్రి



ఆ మర్నాడు హేమప్రభుడు పగలల్లా ఘనిధితో కూడా, తోటలలో తిరుగుతూ అతి కష్టంమీద గడిపి, సాయంత్రం కాగానే రాజకుమార్తె ఉద్యానవనం చేరుకున్నాడు. మిత్రు లిద్దరూ వెళ్లేసరికే చంద్రకళాదేవి శిలావేదికమీద కూర్చుని, వీరి రాకకు ఎదురుచూస్తూ వుంది. ఆమె నాడు ఊదారంగు చీర కట్టుకుని, మెరుగుపెట్టిన బంగారు చమికీ పనితనంగల రవిక తొడుక్కుని, వాటికి అనుకూలమైన నగలూ, కిరీటమూ ధరించి వుంది. ఆమె హేమప్రభునిపైని ఆనందాన్ని ఒలికించే చూపులు ప్రసరింపజేసింది. ఆ దృష్టిప్రసారానికి అతడు తన్మయుడై ఆమెను ఆప్యాయంగా చూస్తూనే తన శిలావేదికమీద కూల బడ్డాడు. అప్పుడు ఘనిధి ఆమె యెదుటికి వచ్చి యిలా ప్రారంభించాడు—

"ఓ నాగరాజపుత్రీ! ఒక వూరిలో ఒక ధనవంతుడైన వర్తకుడు ఉండేవాడు. అతను కురూపి. అతని బంధువులలోనే ఒక పేద కుటుంబీకులు - అతనికి బాగా డబ్బు వున్నదనే కారణంచేత చక్కనిచుక్కవంటి తమ పిల్లను ఇచ్చి వైభవంగా పెళ్లిచేశారు.

ఆ దాంపత్యం, కాకిముక్కుకు దొండపండు కట్టినట్టు ఉందని నలుగురూ అనుకునేవారు. అంచేత భార్యకి భర్తమీద మొదటే అసహ్యభావం ఏర్పడింది. కాని అతనికిమాత్రం ఆమె

మీాద మహా ప్రీతి. అన్ని విధాలా ఆమె సంతోషానికీ, సుఖానికీ అతను ప్రయత్నించేవాడు. ఆమె తనను దాసుడుగా భావించినా తాను ఆమెను దేవతగానే భావిస్తూ వుండేవాడు. అయినా, రోజుకు రోజూ తన జీవితం వ్యర్థమనీ, దుర్భరమనీ ఆమె అనుకొంటూ వుండేది.

ఆమె తన మేడమీాద తిరుగుతూ వుండేటప్పుడు వీథిలో పోతూవుండే అందగాళ్లు కనబడితే, అటువంటి అందగాళ్ళలో ఒకరు తనకు భర్తగా లభిస్తే ఎంత బాగావుండేదో కదా! అని తలపోసేది. ఎవరింటికేనా వెళ్లితే, తనను చూసి ఎవరైనా 'యీామె ఫలానాఆయన భార్య' అని అనుకుంటే తనకు చిన్నతనమని ఆమెకు అనిపించేది.

కొద్దికాలం అయాక ఎలాగన్నా ఆ భర్తను విడిచిపెట్టి పుట్టింటికి పోదామని ఆమెకు బుద్ధిపుట్టింది.

ఒకనాడు భర్త యింట్లో లేకుండా చూచి, ఆమె తన నగలూ, కొంత నగదూ తీసుకుని ఇల్లు విడిచి వెళ్లిపోయింది. అక్కడికి ఆమె పుట్టిల్లు వారంరోజుల ప్రయాణం. ఆమెకు దారీ, తెన్నూ కూడా తెలియదు. ఎక్కడ, ఎవరివల్ల ఏం ప్రమాదం వస్తుందో అనే భయంకూడా ఎక్కువగా వుంది. అయినా రెండో మనిషిమీాద నమ్మకం లేకపోవడంచేత తనకి సాయంగా ఎవ్వరినీ తీసుకెళ్ళలేదు.

పగలల్లా దారితోడు చూచుకుని ప్రయాణం చేస్తూ, పొద్దు పోకముందే ఏవూళ్లో సత్రం వుంటే అక్కడ బసచేసి, ఆ రాత్రి అక్కడ తల దాచుకుంటూ ఆమె ప్రయాణం సాగించింది.

ఒకరోజు సాయంకాలం అయేసరికి ఆమె ఒకవూరు చేరుకుంది. కాని ఆ వూళ్ళో సత్రం లేదు. అక్కడికింకా తమ వూరు ఒకరోజు ప్రయాణం. ఎక్కడ బసచేసేదీ తెలియక తబ్బిబ్బుపడుతూ వుండగా ఒక గృహస్థు కనబడి 'అమ్మా! మీరు కలతపడ నక్కర్లేదు. ఎటువంటి అరమర, అభ్యంతరమూ లేకుండా మా యింట్లో స్వేచ్ఛగా యీ రాత్రి ఉండిపోవచ్చు. నేనూ కుటుంబీకుణ్ణి. నా విషయంలో ఎలాంటి అనుమానము పడనక్కర్లేదు' అని ధైర్యం చెప్పి, నమ్మించి ఆమెను తన యింటికి వెంట తీసుకుపోయాడు. పైకి ఇలా చెప్పేడేగాని, ఆమె చక్కదనం చూసి, అతను మనసులో భ్రమించాడు. ఆ వృద్ధేశంతోనే తన యింట బస యిచ్చాడు. అమాయికురాలైన వర్తకుడి భార్యకు పాపం, యీ సంగతి యేమీ తెలియదు.

ఆరాత్రి ఆమె నిద్రిస్తున్న సమయంలో ఆ కుటుంబి ఆమె దగ్గిరికి వచ్చి తాకబోయాడు. అతని చెయ్యి తగిలీ తగలటంతోనే ఆమె తుళ్లిపడి లేచి వీధివైపు పరిగెత్తింది. దారిలో ఒక గుమ్మం అడ్డంగా వుందనే సంగతి ఆ చీకట్లో ఆమెకు తెలీక దభాలున పడిపోయింది. ఆ పడిపోవడంలో రెండుకాళ్ళ బొటనవేళ్లూ చితికిపోయి, రక్తం ప్రవహించింది. తలకీ పెద్ద దెబ్బ తగిలింది. ఆమె ఆ దెబ్బలకి లక్ష్యం చెయ్యకుండా వీధిలోకి వచ్చి వేసింది. గట్టిగా అరుస్తే తనకే అవమానంకదా అని బాధ భరించి ఊరుకుంది. ఆమె మరో ఇంటి అరుగుదాకా వచ్చి, స్మృతితప్పి, ఆ గుమ్మంలో మూర్ఛపడిపోయింది. ఉదయం కాగానే ఆ యింటివాళ్లూ, చుట్టుపక్కలవాళ్లూ వచ్చి చికిత్స చేసి ఆమెను మూర్ఛ తేరిచి, సంగతి సందర్భాలు తెలుసుకుని,

ఆమెను పుట్టింటికి దిగబెట్టారు.

ఆమెకు గాయాలు మానడానికి రెండు మూడు నెలలు పట్టింది. కాని, ఆమె కాలివేళ్ళమీద మచ్చలు మాత్రం శాశ్వతంగా వుండిపోయాయి.

ఆమె గొప్ప వర్తకుని భార్య కావడంచేతా, డబ్బుతో కూడా రావడంచేతా తల్లిదండ్రులే కాకుండా తక్కిన వాళ్ళందరూ కూడా కొంతకాలం చాలా గౌరవంతో చూచారు. ఆమె యెందుకు ఇలా ఒంటరిగా వచ్చేసిందా అనే ప్రశ్నే రాలేదు.

కాని క్రమంగా ఆ గౌరవం తగ్గిపోసాగింది. ఆమె ఎప్పటికీ తిరిగి అత్తవారింటికి ప్రయాణం కాకపోవడంచేత, మెల్లిగా అందరికీ అర్థమైంది - ఆమె భర్తమీది అసహ్యంకొద్దీ అతన్ని విడిచిపెట్టి పుట్టిల్లు చేరుకునివుంటుందని.

క్రమంగా ఆమెమీద అందరికీ అసహ్యభావం ఏర్పడింది. ఊళ్ళో వాళ్ళందరూ వన్నెలూ చిన్నెలూ కల్పించి, వింతవింత కథలు ఎన్నో అల్లడం ప్రారంభించారు. ఇవన్నీ ఆమె చెవిని పడి, మనసుకు చాలా బాధ కలిగించేవి.

లోకుల ప్రసంగాలవల్లనైతేనేమి, వారివారి కాపరాలను చూడడంవల్లనైతేనేమి - ఆమెకు ఒక్క సంగతి బాగా బోధపడింది. 'భర్త ఎలాంటివాడైనా సరే - అతనిదగ్గర వుంటేనే ఆడదానికి గౌరవం! అక్కడ వుండడమే ఆమె ధర్మం!' అని. కాని, ఎంత ప్రయత్నించినా - తిరిగి భర్త దగ్గిరికి వెళ్ళటానికి మనస్కరించింది కాదు.

ఒకప్పుడు ఆమె వదినెగారు ఏదో సందర్భంలో 'మని

షికి గుణం ప్రధానం గాని, అందం కాదు. ఈ తనువులు శాశ్వతమా ? లోకంలో నిలిచేవి మాటలో' అంటూ ఎత్తిపొడిచింది. ఈ మాటకు ఆమె తలవంచుకోవలసి వచ్చింది.

అప్పుడు తన చూపు కాలివేళ్ళమీద పడింది. ఆ వేళ్ళు మునపటిలాగు కాక ఇప్పుడు చాలా అందవికారంగా ఉన్నాయి. క్షణంలో తన శరీరానికి సంబంధించిన కాలివేళ్ళు ఎలా మారిపోయిందీ, ఆమెకు బోధపడింది.

'మా వదినె చెప్పినమాట అబద్ధంకాదు' అని అప్పుడు ఆమెకు బోధపడింది. మనస్సులో గొప్ప మార్పు కలిగింది.

'నేను పుట్టింటికి వచ్చి ఏడాది అయింది. ఇకనైనా నా భర్తదగ్గిరికి వెళ్ళిపోవడమే అన్నివిధాలా శ్రేయస్కరం' అని ఆమె నిశ్చయించుకుంది. తన నిశ్చయాన్ని తల్లిదండ్రులకీ, ఆప్తులకీ తెలిపింది. వాళ్లూ సంతోషించి దీవించారు.

రెండు రోజులలో ప్రయాణం అనగా-దురదృష్టవశాత్తూ, ఆమెకు తీవ్రంగా జ్వరంవచ్చి తర్వాత ఒత్తుగా అమ్మవారు పోసింది. ఆమె తేరుకొని, బతికి బయటపడటానికి నిండు రెండు నెలలు పట్టింది. ఆమె శరీరమూ, ముఖమూ ఇప్పుడు చాలా వికారంగా తయారయాయి. అద్దంలో ముఖం చూసుకుంటే—'నే నెవరిని ?' అన్నట్టుగా ఆమెకు తోచింది. తన శరీరం తనకే రోత కలిగించింది.

ఈ స్థితిలో ఆమె గర్వం పూర్తిగా పటాపంచలైంది. భర్త ఉత్తముడనీ, ఆతని సుగుణాలముందు తన సౌందర్యం దిగదుడుపనీ బోధపడింది. 'క్షణంకూడా ఇక ఆలస్యం చెయ్య కూడదు. భర్త దగ్గరికి పోవాలి. అతని పాదాలమీద పడాలి.

క్షమించుమని ప్రార్థించాలి. ఆతడు క్షమిస్తేనే జీవితశేషం ప్రశాంతంగా గడిచేది' అని ఆత్రత కలగసాగింది. పూర్తి ఆరోగ్యం చేకూరినతరువాత తాము సాయంవచ్చి దిగపెట్టుతామనీ, కొన్నాళ్ళు పోనియ్యమనీ తలిదండ్రులూ బంధువులూ, కాలయాపన చేయసాగారు.

'ఇది పనికా'దని తలిచి, ఆమె ఒకనాటిరాత్రి-ఎలా వచ్చిందో అలాగే - పిట్టకు తెలియకుండా భర్తదగ్గిరికె వెళదామని బయలుదేరింది.

ఆమె ఒక్క-పూపున ప్రయాణంచేసి, ఆకలిదప్పికలు లెక్క-చేయకుండా నడిచి నడిచి, ఒకనాటి ఉదయానికి భర్త యింటికి చేరుకున్నది. తలుపు తట్టింది. కాని, అతడు వచ్చేలోపలనే, బలహీనతవల్ల సొమ్మసిల్లి గోడకు చేరబడిపోయింది. వర్తకుడు గబగబా వచ్చాడు. తలుపు తీశాడు. ఆమెను చూసి పోలిక పట్టలేకపోయాడు. కాని మరుక్షణంలోనే తెలుసుకొని, బొటబొట కన్నీళ్ళు రాల్చాడు. ఎంతో దయతో, ప్రేమతో ఆమెను ఎత్తుకొని లోపలికి తీసుకుపోయి పడకమీద పడుకోబెట్టి సేద తేర్చాడు. కొంతసేపటికి ఆమె కన్నుమూతలు విప్పింది. ఎదట, ఎంతో జాలిగా, ప్రేమగా కన్నీళ్లు కురిపిస్తున్న భర్త కనబడ్డాడు!

అప్పటి ఆమె స్వరూపం వికారంగా వుంది. శరీరం చిక్కిపోయి, బలహీనంగా వుంది. ఆమె మురికిగా వున్న చినిగిన చీర ధరించి వుంది. నడిచి రావడంవల్ల బాటమీది ధూళి ఆమె మోకాళ్లవరకూ వ్యాపించి వుంది. దారిబోయే బిచ్చకత్తెకంటే కూడా ఆమె హీనమైన స్థితిలో కనబడింది. ఆమె తెలివితెచ్చు

కుని, భర్తను చూసి సిగ్గుపడి, కళ్ళంట నీళ్ళు కారుస్తూ, చేతులు జోడించి పడకమీదినుంచి లేవబోయింది. కాని భర్త ఆమెను లేవనియ్యలేదు. కన్నీళ్ళు కారుస్తూనే అతను తన పైమీది వస్త్రంతో ఆమె కాళ్ళదుమ్ము తుడవసాగాడు.

అతను అలా తుడుస్తూ వుండగా, అతని దృష్టి ఆమె కాలివేళ్ళమీద పడింది. అతను ఆ వికారంగా వున్న వేళ్ళను తన చేతివేళ్ళతో తాకి, విచారంతో చిరునవ్వు నవ్వాడు. ఆమె మౌనంగా ఆతనివేపు విప్పారిన కన్నులతో చూచింది. వెంటనే హృదయం పగిలి, ఆమె చచ్చిపోయింది. ఆమె హఠాత్తుగా చనిపోవడంతో నుంచున్నపాటున అతనూ నేలకు ఒరిగి మరణించాడు.

రాజకుమారీ! ఆ వర్తకుడి భార్య హృదయం పగిలిపోవడానికి కారణం ఏమైవుంటుందో!" అని ధీనిధి ఊరుకున్నాడు.

ఆమె యిలా సమాధానం చెప్పింది: "పట్టరాని విచారంవల్ల ఆమెగుండె పగిలిపోయింది. ఆమె ప్రవర్తనకు, ఆమె భర్త అపారమైన తన దయను ప్రతిఫలంగా ఇచ్చాడు. అయితే ఆ కాలి మచ్చలవల్లనే ఆమె ప్రవర్తనను అతను సూచించినట్లయింది. ఈ సూచనవల్ల ఆమెకు హఠాత్తుగా పశ్చాత్తాపం కలిగి, దుఃఖం నదీప్రవాహంవలె పొంగిపొరలింది. దాన్ని ఇముడ్చుకోవటం ఆమె హృదయానికి సాధ్యంకాలేదు. అంచేతనే అది పగిలిపోయింది."

ఇలా సమాధానం ఇచ్చి, ఆమె విచారంతో రాజువైపు చూస్తూ వెళ్ళిపోయింది. రాజు మనస్సు ఆమె వెంటనే వెళ్ళిపోయింది. శరీరంమాత్రం ధీనిధితోపాటు బస చేరుకుంది.

బసకు వచ్చాక రాజు ధీనిధిని చూసి 'ఓ కఠినుడా! ఈ దినంకూడా వ్యర్థం చేశావు. నీ ప్రశ్నకి చంద్రకళ అవలీలగా జవాబిచ్చింది. నీ అపరాధం క్షమించతగినదికాదు. కాని ఆమె నేడు నావైపు దీనంగా చూడడంచేత, నిన్ను క్షమిస్తున్నాను. ఆమె చిత్రం చూస్తూ ఎలాగో ఒకలాగు రేపటిదాకా ప్రాణాలు బిగపట్టి వుంటాను. రేపైనా-ఆమె జవాబు చెప్పలేని చిక్కు ప్రశ్నని ఆలోచించు' అని అంటూ, ఆమె చిత్రాన్నే చూస్తూ జాగరం చేసి రాత్రి వెళ్ళబుచ్చాడు.

---

# ఎనిమిదవ రాత్రి

—:—

మరునాడు రాజు ధననిధితో పగలల్లా చుట్టుపక్కల వున్న తోటల్లో కాలం గడిపి సాయంత్రం అయేసరికి చంద్రకళా దేవి ఉద్యానవనం చేరుకునేసరికే రాజకుమారి శిలావేదిక మీద కూర్చుని వుంది. నాటిదినం ఆమె మరకతమాణిక్యపు రంగు చీరకట్టుకుని, చంద్రకాంతమణుల రవిక తొడుక్కుని, వాటికి తగిన నగలూ, కిరీటమూ ధరించి వుంది. నాడు ఆమె హేమప్రభుని ప్రేమతో చూస్తూ పరవశించేసింది. అతడు తన్ను తాను మరచి తన శిలావేదికపై చతికిలబడ్డాడు. తరువాత ధననిధి ముందుకు వచ్చి ఆమె యెదుట నిలిచి యిలా చెప్పడానికి ప్రారంభించాడు—

"రాజపుత్రీ! ఒక వూళ్లో ఒక యింట్లో భార్యాభర్తలు కాపరం చేస్తూ వుండేవారు. భార్యకు భర్త అంటే యిష్టంలేదు. ఆమె చిరునవ్వుతో ఆతనికి ఎన్నడూ కనబడే యెరుగదు. ఒకనాడు ఆమె గుమ్మంలో నిలబడి వుండగా, దారంట పోతూవుండే అందగాడైన రాజపురోహితుణ్ణి చూడడం తటస్థించింది. అతడూ ఆమెను చూశాడు. ఇద్దరి చూపులూ కలిసినై. ఒకరిపై ఒకరికి గాఢమైన ప్రేమ ఏర్పడింది. ఆమె భర్త చాలా ముక్కోపీ, ముందుజాగ్రత కలవాడూ కావడంచేత, ఎంత ప్రయత్నించినా యిద్దరూ మళ్లీ కలుసుకోవడానికి వీలుపడలేదు.

అందుకోసం రాజపురోహితుడు ఒక ఉపాయం పన్నాడు. అతడికి పరకాయప్రవేశవిద్య తెలుసు. అంటే— ప్రాణంలేని ఏ బొందిలోనన్నా ప్రవేశించి దాన్ని బతికించ గల డన్న మాట. తన శరీరంతో ఆమెను కలుసుకోవడం సాధ్యం అయేటట్టు లేదని నిశ్చయించి, ఎలాగన్నా ఆమెభర్త శరీరంలో ప్రవేశించి, ఆమెను తనదానిగా చేసుకోవాలని అనుకున్నాడు.

అందుకని ముందుగా పురోహితుడు ఆమెభర్తతో స్నేహంచేశాడు. తన అద్భుతమైన యోగవిద్యలు చూపి, అతడిని ముగ్ధుణ్ణి చేశాడు. వాళ్లిద్దరికీ క్రమంగా స్నేహం వృద్ధి అయింది.

ఒకనాడు పురోహితుడు అతనితో 'నీకు చిత్రమైన పరకాయప్రవేశవిద్య నేర్పుతాను; నేర్చుకుంటావా నేస్తం ?' అన్నాడు.

'సరే!' అన్నాడు అతడు. ఇంకొక శరీరంలో దూరి ఆ తమాషా ఏమిటో చూడాలనే ఉబలాటమే తప్ప, పురోహితుడు వేసిన ఎత్తు ఆ మూర్ఖుడికి తెలియనే తెలియదు.

ఒకనాటి రాత్రి ఆ పురోహితుడు ఆ మిత్రుణ్ణి పరకాయ ప్రవేశవిద్య నేర్పడానికని శశ్మానభూమికి తీసుకువెళ్లాడు. అక్కడికి వెళ్లాక మంత్రాలూ తంత్రాలూ జరిపి, బొందిలో నించి పైకివచ్చే మంత్రమూ, తిరిగి బొందిలో ప్రవేశించే మంత్రమూ మిత్రుడికి ఉపదేశించాడు.

ఇద్దరూ వారి వారి దేహాల నుంచి బయటపడ్డారు. అలాంటి అవకాశంకోసమే ఎదురుచూస్తూవున్న పురోహితుడు అతను బయటకు వచ్చిందే తడవుగా మిత్రుడి శరీరంలో

ప్రవేశించి తన ప్రియురాలికోసం గబగబా మిత్రుడి యింటికి దారితీశాడు.

అక్కడ—

తన ప్రియుడు, తన భర్తని ఏదో నెపంమీద ఆ రాత్రి తీసుకుపోయాడు. రాత్రి యింటికి రావడానికి వీలులేదనీ, భద్రంగా వుండమనీ భర్త చెప్పి వెళ్లిపోయాడు. కనుక, ఆమె తన ప్రియుడికోసం ఎదురుచూడక వెంటనే బయలుదేరి సరాసరి అతనియింటికే వెళ్లింది. అనగా ఆమె యిల్లు విడిచి పురోహితుని యింటికి వెళ్లిందన్నమాట. ఇప్పుడు ఆమెభర్తశరీరంలో ప్రవేశించివున్న పురోహితుడు ఆమెయింటికి వెళ్లి, అక్కడ ఆమెకోసం ఎదురుచూస్తూ కూర్చున్నాడు.

పురోహితుడి మిత్రుడు తన శరీరం విడిచిన తర్వాత, అతడు దూరుదామంటే ఏబొందీ కనబడలేదు. అందుచేత విధిలేక అతను తన పక్కనే వున్న పురోహితుడి శరీరంలో దూరక తప్పిందికాదు.

బాధతోటీ, విచారంతోటీ అతడు ఆ బొందిలో ప్రవేశించి ఇంటిముఖం పట్టాడు. కాని,. అతడు దూరిన శరీరం పురోహితుడిది కావడంచేత, అలవాటుకొద్దీ వాని అడుగులు పురోహితుడి యింటికే దారి తీశాయి!

అతను అక్కడికి వెళ్లేసరికల్లా ఆ యింట్లో తన భార్యే కనబడింది! అతనికి చాలా ఆశ్చర్యం వేసింది. విపరీతమైన కోపం కూడా రాబోయింది. కాని, అతన్ని చూడగానే అతడు తన ప్రియుడైన పురోహితుడే అనే అభిప్రాయంతో ఆమె ప్రేమతో దగ్గిరికి వచ్చి మామూలుగా చెయ్యిపట్టుకుంది.

రామె యిదివరకెప్పుడూ యింతటి ప్రేమా, అప్యాయతా చూపి ఉండకపోవడంచేతా, ఇప్పుడీ కొత్త అనుభవంవల్ల మైమరపు కలగడంచేతా, ఆమె నిజభర్త తిట్టడం, కోపించడం మానివేసి, ఆమెను దగ్గిరగా తీసుకున్నాడు. ఆరాత్రి యిద్దరూ మనసుతీరా సంసారసుఖం అనుభవించి ఆనందించారు. తెలతెల్ల వారే సమయమయింది. తన భర్త యింటికి వస్తాడేమో అనే ఆత్రంతోనూ, భయంతోనూ ఆమె చరచరా ఇంటికి వెళ్లి పోయింది. పురోహితుడి శరీరంతో తనయింట వున్న తన భర్త ఆమె వెళ్లేసరికి ఇంకా నిద్రనుండి లేవనేలేదు.

తెల్లవార్లూ నిద్రలేక, నిరాశతో తన యింటికి మరలి వచ్చిన పురోహితుడికి తన శరీరంతో, తన పడకమీద పడు కొని వున్న మిత్రుడు కనబడ్డాడు. పురోహితుడికి ఆశ్చర్యమూ కలిగింది, ఒళ్లూ మండింది. అతడు ఉగ్రుడై 'నువ్వు నా యిం టికి వచ్చి, నా పడకమీద పడుకోవడంలో అర్థం ఏమిటీ ?' అన్నాడు.

'నువ్వు నా శరీరంలో దూరి, చెప్పకుండా పారిపోవ డంలో అర్థం ఏమిటీ ?' అని మిత్రుడూ గట్టిగా అడిగాడు.

అందుకు పురోహితుడు 'నీ దేహంలో దూర్చబట్టే నానా యమయాతనలూ పడ్డాను; ఇంకా పడుతున్నాను. ఇందుకు శిక్షగా నీశరీరాన్ని కాల్చివెయ్యడానికే నిశ్చయించు కున్నాను. ఇదిగో ఆ పని ఇప్పుడే చేస్తా' అన్నాడు.

ఇలా అనేసరికి ఆ మిత్రుడు గడగడలాడిపోయి 'బాబూ !- నా దేహం కాల్చివెయ్యకు. నాకు మరేశరీరమూ కనబడక నీ దేహంలో దూరాను. నీ శరీరం నువ్వు తీసుకుని,

నాదేహం నాకిచ్చివెయ్యి,' అని బతిమలాడాడు. తరువాత పురోహితుడు మళ్లీ అతన్ని శ్మశానభూమికి తీసుకువెళ్లాడు. ఇద్దరూ శరీరాలు మార్చుకున్నారు.

ఎప్పటిలాగా తన శరీరంలో తాను ప్రవేశించేసరికల్లా, పురోహితుడి మిత్రుడికి అంతకుముందు జరిగినదంతా జ్ఞాపకానికి వచ్చింది. పురోహితుడిని చూచి అతను మండిపడి 'ఛీ, తుచ్ఛుడా!_ నాభార్యని వశంచేసుకున్న మహాపాపివి ; చూడు నిన్నేం చేస్తానో ?' అని గద్దించాడు.

అప్పుడు పురోహితుడు 'నీ భార్యతో నాకేమి సంబంధం ? అధికప్రసంగాలు చేయక ఫో' అన్నాడు.

కాని అతను అంతటితో ఊరుకోనక పురోహితుడినీ, భార్యనూ నేరస్థులుగా చేసి, న్యాయస్థానానికి యీడ్చి, జరిగిందంతా చెప్పివేశాడు. పురోహితుడినీ, తన భార్యనీ శిక్షించాలని న్యాయాధిపతులను కోరాడు.

అప్పుడు పురోహితుడు 'అతని భార్యను నేను తాకనైనా లే'దని చెప్పాడు. 'శరీరం పురోహితుడిదే ఐనా శరీరం లోపల ఉన్నవాడు నాభర్త కాబట్టే నేను ప్రేమతో అతన్ని చేర్చాను' అని మిత్రుడి భార్య అంది. న్యాయాధిపతులు ఏమి చెప్పడానికీ తోచక తికమకలు పడ్డారు.

ఓ రాజకుమారీ !_ ఈ విషయంలో న్యాయాన్యాయాలు ఎలా నిర్ణయించటం?'' అని అడిగి ధీనిధి ఊరుకున్నాడు.

చంద్రకళాదేవి వెంటనే యిలా జవాబు చెప్పింది : 'పురోహితుడు మోసగాడే. అయినా, అతని తంత్రం కొనసాగలేదు. అతని ప్రియురాలేమో, తప్పుచేసిన మాట వాస్తవమే.

కాని, ఆమె తనభర్త ఎదుటనే-అతని అంగీకారంతోనే-అతని అభీష్టం నెరవేర్చింది. ఆమెభర్త - అస్థిరబుద్ధి కలవాడై — ఆమె ప్రేమకి లొంగిపోయి - ఆమెను మంచిదానికి తేకుండా— పురోహితుడి రూపంలోనే దగ్గరకు చేర్చుకున్నాడు. అది అతని తప్పు. ఈ పరిస్థితులలో అవహేళనచేసి పంపడమే అతనికి పెద్ద శిక్ష!- అదే చాలు. అందుచేత ఎవ్వరికీ ఏ శిక్షా లేకుండా విడిచి వెయ్యడమే న్యాయం."

ఇలా అంటూ, ఆమె రాజువేపు ఆప్యాయంగా చూస్తూ వెళ్లలేక వెళ్లలేక అక్కడినుంచి వెళ్లిపోయింది. రాజు మనస్సూ ఆమెను వెంబడించింది. శరీరంమాత్రం ధీనిధితో పాటు బస చేరుకుంది.

బసకు వచ్చాక ధీనిధిని చూస్తూ రాజు "మిత్రుడా! నువ్వేమో కథలు చెప్తున్నావేగాని, ఆమె సౌందర్యాన్ని-అన్ని ఇంద్రియాల శక్తుల్నీ చూపులోనే కేంద్రీకరించి చూస్తూవున్న నాకు, ఆ కథలేవీ వినబడలేదు. ఎనిమిదిరోజులు నిష్కారణంగా గడచిపోయాయి. ఇంక ఎనిమిదిరోజులే మిగిలివున్నాయి. ఆమె నాకు లభించకపోతే నిన్ను క్షమించేదిలేదు. రోజుకు రోజూ—ఆమెకు నాపై దయ ఎక్కువ అవుతున్నట్లు ఆమె హావభావాలవల్ల తెలుస్తూవుంది. అక్కడున్నంతసేపూ ఒకరీతి మైకంలో వున్న నాకు—ఆమెను చూడకుండా క్షణం గడపడం కష్టంగావుంది. రేపటిదాకా బతికివుంటానో లేదో అనే నా సందేహం" అని పల్కి ఆమె చిత్రాన్ని చూస్తూ వేదనతోనే ఆ రాత్రి వెళ్లబుచ్చాడు.

—

# తొమ్మిదవ రాత్రి



మరునాడు హేమప్రభుడు అతికష్టంమీద మిత్రుడితో కూడా కాలంగడిపి సాయంత్రానికి రాజకుమారి ఉద్యానవనం చేరుకున్నాడు. వీరు వెళ్ళేసరికే ఆమె శిలావేదికమీద కూచుని వుంది. ఆనాడు ఆమె నారింజరంగు చీర ధరించి, వజ్రాల రవిక తొడుక్కొని వాటికి తగిన నగలూ, కిరీటమూ ధరించి వుంది. రాజును చూడగానే ఆమెముఖంలో విచారచ్ఛాయలు తొణికిసలాడాయి. అతడు ఆమె సౌందర్యాన్ని చూపులతో ఆస్వాదిస్తూనే, మౌనంగా శిలావేదికమీద కూలబడ్డాడు. అప్పుడు ధీనిధి ఆమె యెదటికి వచ్చి నిలిచి ఇలా ప్రారంభించాడు—

"రాజకుమారీ! ఒకా నొకప్పుడు ఒక వర్తకుడు తన బిడారుతో ఒక పెద్ద ఎడారిని దాటుతూ వుండెను. అతను ఎడారిలో పోతూవుండగా దూరంగా, ఒకానొక పట్నపు గోడలూ, ఆకాశపురంగుతో వున్న పెద్ద సరస్సూ అతని కంటికి కనబడ్డాయి.

ఆ నగరాన్నీ, ఆ సరస్సునూ చేరుదామని అతనికి కుతూహలం కలిగింది. అతడు తన బిడారునీ, ఒంటెలనీ తీసుకొని పట్నమూ, సరస్సూ కనబడుతున్న వేపుకి నడిపించాడు.

కొంతసేపటికి అవి వున్నట్టేఉండి మాయమైపోయాయి. ఎండలో నెత్తిమాడడమే వర్తకుడికి దక్కింది. అప్పుడు అతనితో కూడా ఉన్నవాళ్ళు, అది వట్టిభ్రమే అనీ, ఎండ

మావులవల్లనే అలా కనబడుతున్నదనీ తెలియజెప్పారు. కాని అతడు ఈమాటలను చెవినిపెట్టలేదు. అతడు తన బిడారుతో ఆ చోటనే బసచేసి, మర్నాడు మళ్ళీ ఆ పట్నమూ, సరస్సూ కనబడేదాకా ఎదురుచూసి, మళ్లీ ప్రయాణం సాగించాడు.

కొంతదూరం వెళ్లేసరికి మళ్లీ మునపటిలాగానే అవి మాయమైపోయాయి.

తర్వాత ఆ వర్తకుడు తన ప్రయాణం నిలిపివేసి, ఆ ఎడారిలోనే బసచేసి, ప్రతినిత్యమూ ఆ పట్నాన్నీ, సరస్సునీ చేరడానికి ప్రయత్నిస్తూ, అవి మాయమైపోగా విచారిస్తూ వుండేవాడు. అవి మాయమైపోతూ వున్నకొద్దీ, వాటిని చేరాలనే పట్టుదలకూడా వర్తకుడికి అధికమైపోయింది.

క్రమంగా, ఆ భ్రాంతిలో పడి అతను ప్రపంచాన్నే మరచిపోయాడు. ఈలోగా అతని వ్యాపారపు సరుకు అంతా పాడై పోయింది. అతనికి పట్టిన పిచ్చి తెలిసి, బంధువులు కొందరు వచ్చి "ఏమిటి నీ పిచ్చి పని? ఇదంతా ఎండమావుల ప్రభావమే నని నీకు తెలియదా? నువ్వు నీ కాలాన్నంతనీ యీ భ్రాంతిలో పాడుచేసుకోవడమే కాకుండా నీ ధనాన్ని నాశనం చేసుకుంటు న్నావు. ఇకనైనా యీ పిచ్చిచేష్టలు కట్టిపెట్టు" అన్నారు.

ఆ మాటలు విని వర్తకుడు 'మీరు పొరపడుతున్నారు. కళ్లార చూస్తున్నది భ్రాంతి అని మీరెలా అంటారు? మీరందరూ నాకెలా కనబడుతున్నారో, అలాగే ఆ నగరమూ, సరస్సూ నా కంటికి స్పష్టంగా కనబడుతున్నాయి' అని వర్తకుడు బదులు చెప్పాడు.

'ఓయీ! బుద్ధిహీనుడా! నీకు కనబడుతున్నవి ఎండ

మావులు! ఇదంతా కేవలమూ భ్రాంతి!' అన్నారు మళ్లీ వారు.

కాని తన కంటికి కనబడుతున్నది మాయ ఎలా అవుతుందని వర్తకుడు గట్టిగా వాదించాడు.

ఎంత చెప్పినా లాభంలేకపోయేసరికి, వారందరూ అతనిని విడిచిపెట్టి వెళ్లిపోయారు.

వర్తకుడికి పట్టుదల ఎక్కువైంది. ప్రయాణంలో ఒంటెలు చచ్చిపోతున్నా కొత్తవాటిని కొంటూ, ఆ ఎండమావులను వెంబడిస్తూనే వున్నాడు. ఇలాగు ఒంటెలకోసం అతని ధనమంతా ఖర్చయింది. మరి కొద్దికాలంలోనే తక్కిన ఒంటెలన్నీ చచ్చిపోయాయి. చివరకి అతడున్నూ ఆ ఎడారిలోనే ప్రాణం విడిచాడు.

ఈ వృత్తాంతం దేశమంతటా వ్యాపించింది. దీన్ని విన్న జనులు 'ఆ ఎడారిలో ఏమి మాయ వుందో ఏమో! అక్కడ సూర్యుడు, పాపం! వర్తకుడిని పిచ్చివాణ్ణి చేసివేశాడు' అని అంటూ, జాలిచెందారు.

"ఆ పిచ్చివాడు తాను నాశనమయిపోవడమే కాకుండా తన అవివేకంచేత మమ్మల్నికూడా మాపివేసి తీరని కష్టాలు పెట్టాడు" అని బంధువు లన్నారు.

'ఇది విన్న ఒకానొక సన్యాసి తనలో తాను 'నవ్వుకుని "భ్రమనుగురించి బయల్దేరే అత్యాశను సృష్టియొక్క విషమయ ఘట్టమని చెప్పవచ్చు కదా! పెద్దబాన చట్టికుండను చూసి 'ఛీ! అల్పమైన ఓ మట్టి స్వరూపమా!' అని నిందిస్తుంది" అన్నాడు.

రాజకుమారీ! ఆ సన్యాసిమాటలలో అభిప్రాయ మేమిటయివుంటుందో!" అని పలికి, ధీనిధి వూరుకున్నాడు.

'రాజకుమారి యిలా సమాధానం చెప్పింది: "వర్తకుడు ఎండమావుల్ని నిజమని నమ్మి, సర్వస్వమూ పోగొట్టుకుని నశించిన పిచ్చివాడని తలచినారు అతని బంధువులు. ఐతే, నశ్వరాలైన సంపదలూ, అవి శాశ్వతాలని భ్రాంతి పొందుతున్న తాముకూడా పిచ్చివారే అనే సంగతి వారు తెలుసుకోలేక పోయారు. ఎండమావుల్ని అతడు వెంబడిస్తున్నట్లే వీరున్నూ అనిత్యాలను వెంబడిస్తూ వున్నారు. ఈవిధంగా వాళ్లూ భ్రమలోనే పడ్డారన్న మాట! ప్రపంచం అనేది మాయకాక మరేమిటి? లోకులు ఇలా భ్రాంతి పడుతున్నారు కాబట్టే వాళ్ళు చట్టికుండల్ని వెక్కిరిస్తూ వున్న బానకుండలు అంటూ పోల్చి చెప్పాడు యతీశ్వరుడు."

ఇలా చెప్పి చంద్రకళాదేవి రాజువైపు విచారంగా చూస్తూ, లేచి వెళ్లిపోయింది. రాజు మనస్సు ఆమెను వెంబడించగా, శరీరంమాత్రం ధీనిధితో బస చేరుకొన్నది. బసకు వచ్చాక హేమప్రభుడు మిత్రుడితో "ధీనిధీ! ఈ రోజుకూడా వ్యర్థంగా గడచిపోయింది. ఇంక ఏడురోజులే మిగిలి వున్నాయి. రోజురోజుకూ ఆమె వియోగాన్ని భరించడం కష్టతరమైపోతున్నది. చంద్రుడు క్షీణిస్తూ మబ్బుచాటునకు జారిపోయినట్లు—ఈ చిత్రంకూడా నన్ను క్షీణింపజేస్తున్నది" అని అంటూ అతడు ఆమె చిత్రాన్ని చూస్తూనే ఆ రాత్రి వెళ్ళబుచ్చాడు.

---

# పదవ రాత్రి

మరునాడు రాజు ధీనిధితో కలిసి, పూలతోటల్లో తిరిగి పగలు గడిపి, సాయంత్రమయేసరికి రాజకుమారి ఉండే ఉద్యానవనం చేరుకున్నాడు. ధీనిధి కూడానే వున్నాడు. ఇద్దరూ వెళ్లేసరికే రాజకుమారి శిలావేదికపై అధిష్ఠించివుంది. ఆ రోజున ఆమె వెండిని మించిన తెల్లనిచీర ధరించి, గరుడపచ్చలు కుట్టిన రవిక తొడుక్కుని, వాటికి తగిన ఆభరణ, కిరీటాలు ధరించివుంది.

రాజును చూడగానే ఆమె హృదయం ఉప్పొంగిపోయింది. ఆమెను ఆప్యాయంతో చూస్తూ హేమప్రభుడు తన స్థానంలో కూలబడ్డాడు. ఆ తర్వాత ధీనిధి ముందుకు వచ్చి, ఆమె యెదట నిలబడి యిలా ప్రారంభించాడు—

"రాజకుమారీ! పూర్వం ఒకానొక దేశంలో ఒక రాజుండేవాడు. అతడు లోకంలో తనకు వింతగా తోచిన వస్తువుల నన్నిటినీ ఎంత వెల అయినాసరే, ఇచ్చి కొని, తన భవనంలో ఆప్యాయంగా పెట్టుకునేవాడు. అందుచేత ప్రపంచంలో మూలమూలలనుంచి అపూర్వమైన వస్తువులను తెచ్చిన వర్తకు లెంతోమంది ఎప్పుడూ అతని భవనం నిండివుండేవారు.

ఒకనాడు ఒక వర్తకుడు వచ్చి ఆ రాజుతో యిలా అన్నాడు—"ప్రభూ! నేనొక వింత వస్తువును ఏలినవారికోసం శ్రమపడి తెచ్చాను. మూడులోకాల్లోనూ దీనికి సరిపోల్చదగిన వస్తువు లేనేలేదు. దీన్ని సంపాదించడం నిజానికి చాలా అపాయకరం. అయినా, ప్రభువుల ఉదారతనుగురించి విని, ప్రాణాల

మీద ఆశకూడా విడిచి, అతికష్టంమీద దీన్ని తెచ్చాను."

ఇలా అంటూ ఆ వర్తకుడు ఒక చిన్నపెట్టెలోంచి ఒకగిన్నె బయటికి తీసి రాజుఎదట పెట్టాడు.

అది ఏనుగుదంతంతో చేయబడి, మంచువలె తెల్లగా వుంది. దాని అంచుమాత్రం అతి చక్కటి ఎర్రరంగుగా వుంది. తరువాత ఆ గిన్నెనుగురించిన చరిత్రను ఆ వర్తకుడు యిలా వెల్లడించాడు—

"ప్రభూ! ఇది లంకాధిపతిఅయిన రాక్షసరాజు కుమార్తె బింబోష్ఠి వాడుకునే పాత్ర! మూడు లోకాలలోనూ ఆమెను మించిన అందకత్తె లేదు. రకరకాల అందకత్తెల సౌందర్యాన్నంతనీ పోగుచేసి, ఒకచోట పెట్టి బ్రహ్మ బింబోష్ఠిని సృష్టించినట్టు చెప్పుకొంటారు. ఆమె చక్కదనంలోకల్లా ఎక్కువగా మెచ్చదగినది ఆమె పెదవుల ఎరుపుదనం. వాటి రంగుముందు సిందూరంవంటి ఎర్రని పదార్థాలన్నీ వెలవెలపోతాయి. ఇంకా విశేషం ఏమిటంటే—ఆమె తన పెదవులతో దేన్ని తాకినా, ఆ వస్తువుకు ఆ ఎర్రరంగు అంటుకుని, మరి ఎంత చెరిపినా చెరగనే చెరగదు. ఆమె ద్రాక్షారసం మొదలైన పానీయాలను ఈ పాత్రతోనే తాగుతూ వుండడంచేత—ఆమె పెదవులు తాకడంవల్లనే దీని అంచుకి అపరూపమైన ఈ చక్కటి ఎర్రరంగు అంటుకుని వుంది. నేను ఆమె నౌకరుకు అపారంగా ధనమిచ్చి లోపుచేసికొని, సాహసంచేసి, ప్రాణాలకి తెగించి, దీన్ని చేజిక్కించుకు వచ్చి, ఏలినవారికి బహుమానం ఇద్దామని తెచ్చాను."

ఆ వర్తకుడిలా చెప్పి వూరుకున్నాడు. రాజు ఆ పాత్ర యొక్క చక్కదనానికి ముగ్ధుడయిపోయాడు. ఆ వర్తకుడు

నౌకరుకు యిచ్చివున్న ధనానికి పదిరెట్లు ధనమిచ్చి పంపివేయ వలసిందని ఆజ్ఞాపించి, అతన్ని పంపివేశాడు. ఆ పాత్రను రాజు తన గదిలో భద్రపరుచుకున్నాడు.

రాజుతో వర్తకుడు యీ వృత్తాంతం చెప్తూవుండగా, రాజకుమారుడు అక్కడ వుండి, సంగతులన్నీ విన్నాడు. అతనికి వర్తకుడు చెప్పిన రాక్షసరాజుకూతురుమీద మనసు తగిలింది. ఆమె సంగతినే తలచుకుంటూ అతడు, ఆ రాత్రి పడుకొని కొంతసేపటికల్లా నిద్రపోయాడు.

ఆ నిద్రలో అతని కొక కల వచ్చింది: 'తాను గుర్రాన్ని ఎక్కి, దౌడు తీసుకుంటూ సముద్రపుఒడ్డుకు చేరుకున్నాడట. గభీమని గుర్రం దిగి ఒక పడవలో కూర్చుని తెరచాప ఎత్తి, లంకకు ప్రయాణమయ్యాడట. ఆ పడవ మెల్లగా లంక చేరుకుందిట. ఒడ్డుకు రాగానే రాజకుమారుడు పడవలోనించి ఒక్కగెంతు గెంతి, నేలమీద పడి, పరుగెత్తిపోయి లంకానగరవీథులలో ప్రవేశించాడట. కొంతసేపటికి అతనికి రాజకుమారి ఉండే దివ్య భవనం కనబడిందిట.

అక్కడికి అతడు వచ్చేసరికి సాయంత్రం అయింది. సూర్యుడు పడమటివైపు ఆకాశానికి చివరా, చంద్రుడు తూర్పువైపు ఆకాశానికి చివరా చేరుకుని, అదొక వింతగా కనబడ్డారు. కొంచెం సేపటిలో—చంద్రుడు తన తేజస్సుతో ఆ సౌధాన్ని ఎక్కువ శోభావంతంగా చేశాడు. రాజకుమారుడు ఆ సౌధంమీదికి చూచేసరికి వర్తకుడు వర్ణించి చెప్పిన ఆ లోకోత్తర సౌందర్యవతి—బింబోష్ఠి—అతని కంటబడింది.

చంద్రుడి వెలుగు ఆమెమీద పడి, ఒక కొత్త అందాన్ని

కల్గించింది. కొంత పసుపుపచ్చగా—చంద్రబింబంలాగే వున్న ఆమె ముఖంలో ఎర్రని రెండు పెదవులూ అగ్నిజ్వాలాంకురాల వలె ప్రకాశించినవి. రాజకుమారుడు వాటి తేజస్సుకీ, అందానికీ ముగ్ధుడై పోయి నించున్నపాటునే మూర్ఛపోయాడు.

ఆ మూర్ఛలోనే అతడు. ఆ పెదవులు రెండూ విరామం లేకుండా పెరిగి చివరకి పెద్ద కొండలంతేసి కావడమూ, అవి తర్వాత శిథిలమై లెక్కలేకుండా పెదవుల జంటలు తయారయి, ఆకాశమంతటా వ్యాపించడమూ చూచాడు. అందులో కొన్ని జతలు కిందికివచ్చి అతనిని చేరగా, రాజకుమారుడు వాటిని సున్నితంగా ముద్దుపెట్టుకున్నాడట!

ఇంతలోనే హఠాత్తుగా అతనికి బింబోష్ఠి అంతఃపురం కనబడింది. అతడు చరచరా లోపలికి పోయి—అంతఃపురానికి చివరిభాగంలో వున్న రాక్షసరాజపుత్రిని చూసి, ముగ్ధుడై ఆమె పాదాలదగ్గర కూలబడ్డాడు. ఆమె పెదవులు రాజకుమారుణ్ణి సమీపించాయి. దగ్గరకు రానురాను అవి మిక్కిలి భయంకరమైన దవడలుగా మారిపోయాయి. ఆ దౌడలదగ్గరి పెదవులు ఆకుపచ్చరంగుతో వున్నాయి. ఆ దవడలు రెండిటిలోనూ రెండు వరసల దంతాలు, తెల్లగానూ, రంపపుపళ్లలాగా వాడిగానూ వున్నాయి. వాటి లోపలి భాగంలో నల్లగా కనపడే ఒక గొయ్యి భయం గొల్పుతూవుంది. అవి పెద్దవిగా పెరుగుతూ రాజకుమారుడిమీద పడడానికి వచ్చేసరికి తుళ్లిపడి అతడు గట్టిగా ఒక్క కేకవేశాడు.

అంతలో తెలివి వచ్చేసింది.

రాజకుమారీ! ఆ రాజకుమారుడు అలా కేకవేయడానికి

కారణమేమిటయి వుంటుందో!'' అని పలికి, ధీనిధి ఊరుకున్నాడు.

అందుకు చంద్రకళాదేవి ''వేరేముంది? ఆ దవడలు తన్ను నొక్కివేస్తాయని పాపం, భయపడ్డాడు!'' అని చిరునవ్వుతో సమాధానం చెప్పేసి, తన విశాలనేత్రాలతో రాజును విప్పారగా చూస్తూ వెళ్లిపోయింది. రాజు మనస్సు ఆమెవెంట పరుగెత్తినా, శరీరం మెల్లిగా బసచేరుకుంది.

బసకు వచ్చాక రాజు ధీనిధితో ''మిత్రుడా! ఆ వర్తకుడు చెప్పినది శుద్ధాబద్ధం. ఏమంటే—నా ప్రియురాలి పెదవులతో సమానమైనవి ఎక్కడా వుండవు. ఆమె పెదవులమీది ఆ నవ్వు సాటిలేనిదిగదా! నీప్రశ్నలకి ఆమె సునాయాసంగా, అతినేర్పుగా సమాధానం యిస్తూవుంటే రోజుకురోజూ నా ఆశ క్షీణించి పోతున్నది. ఇంక ఆరురోజులే మిగిలివున్నాయి. ఆమె నాకు దక్కదేమో అనే అనుమానంతో—ఆమె సౌందర్యాన్ని క్రోలుతూ వున్నాకూడా—అమృతంలో విషబిందువు పడ్డట్లు అనిపిస్తున్నది. ఆమె చిత్రాన్ని ఎదట ఉంచుకున్నప్పటికీ, ఇప్పుడది నన్ను వెక్కిరిస్తూ వున్నట్లు కనబడి మనసుకు కష్టాన్నే కలిగిస్తున్నది. తెల్లవారేవరకూ ఎలా బతుకుతానో, యేమో!'' అని వాపోతూ, ఆచిత్రంవేపు చూస్తూనే, అతికష్టంతో ఆరాత్రి గడిపాడు.

---

# పదకొండవ రాత్రి



మరుచటి రోజున రాజు ఛీనిధి సహాయంతో పగలల్లా గడిపి సాయంకాలం అయేసరికి రాజపుత్రి ఉద్యానవనానికి వచ్చాడు. ఛీనిధి అతన్ని వెంబడించాడు. వారు వచ్చేసరికే చంద్రకళాదేవి సిద్ధంగా వుంది.

ఆ నాడామె ముత్యాలరంగు చీర ధరించి, తళతళలాడే ఒకజాతి మణులు కుట్టిన రవిక తొడుక్కుని, వాటికి తగిన ఆభరణాలూ, కిరీటమూ ధరించి వుంది. ఆమె రాజును సిగ్గుతో చూసింది. రాజు ఆమె ముగ్ధమధుర సౌందర్యాన్ని చూపులతో ఆస్వాదిస్తూ, పరవశుడై తన శిలావేదికమీద కూలబడ్డాడు. అప్పుడు ఛీనిధి ముందుకు వచ్చి ఆమెయెదుట నిలబడి ఇలా చెప్పడానికి ప్రారంభించాడు—

"రాజకుమారీ! ఒక పట్టణం బయట ఒక పెద్ద మర్రి చెట్టు వున్నది. దాని తొఱ్ఱలో ఒక గొప్ప నాగుపామున్నది. అది ప్రతిరోజూ తొఱ్ఱలోనించి బయటికి వచ్చి చెట్టుకింద చుట్ట చుట్టుకుని కొంచెంసేపు విశ్రాంతి తీసుకునేది. ఆ సమయంలో ప్రజలు పాలూ, మధురపదార్థాలు తెచ్చి దానికి అర్పించేవారు. అవి ఆరగించి, అది మళ్లీ తన తొఱ్ఱలోనికి వెళ్ళిపోతూవుండేది.

ఆ వూళ్ళోనే ఒక గొప్ప రత్నాలవర్తకుడు ఉండేవాడు. అతనికి ఒక కుమార్తె. ఆమె చాలా అందకత్తె. ఆమెకు రత్నాలంటేనూ, విలువగల మణులంటేనూ ఎంతో మోజు. తండ్రి

రత్నాలవర్తకుడు కావడంచేత, ఆమె ప్రపంచంలోని రకరకాల రత్నాల నన్నిటినీ సంపాదించింది.

అయితే ఒకప్పుడామెకు — ఊరిబయట మఱ్ఱిచెట్టు తొఱ్ఱలో వున్న పాము తలమీది మణిని ఎలా అయినా సంపాదించాలనే కోరిక కలిగింది. ఈ వుద్దేశం ఎప్పుడైతే కలిగిందో, ఆ వెంటనే సాహసుడైన ఒకనికి డబ్బిచ్చి, వాడిచేత ఒకరాత్రి ఆ పామును చంపించి ఎలాగో ఆ మణిని సంపాదించింది. ఆ మణి లభించడంతో తన జన్మ సఫలమైనట్టుగా తలచి, ఆమె దానిని తన శిరోభూషణంగా ఉపయోగించింది.

నాగరాజైన వాసుకి యీ వృత్తాంతం తెలిసికొన్నాడు. రత్నాల వర్తకుని కూతురు ఇలా తన వంశస్థుని చంపినందుకు అతడు ఉగ్రుడై, ఆమెకు తగిన శిక్ష విధించాలని నిశ్చయించుకున్నాడు.

ఆ నాగరాజు వెంటనే మానవరూపం దాల్చి, మంచి అందగాడైన ఒక రత్నాలవర్తకుని పుత్రుడుగా తయారై, ఆ వర్తకుడి యింటికి దగ్గరగానే ఒక యిల్లు అద్దెకు తీసుకుని, అందులో బసచేశాడు. తాను వర్తకంమీద దేశసంచారం చేస్తూవున్నట్లు అందరికీ తెలియజేశాడు. పరిచయస్థుల నందరినీ చాలా గౌరవిస్తూ, కోరిన బహుమానాలిస్తూ, విందుభోజనాలు జరుపుతూ, యిలాంటి త్యాగమూర్తి ఎక్కడా లేడు అనేటటువంటి గొప్పపేరు సంపాదించాడు.

నాగరాజు తన చక్కదనంచేతనూ, సంపదచేతనూ ఆ రత్నాల వర్తకుడి మనస్సును ఆకర్షించాడు. ఇద్దరికీ బాగా పరిచయమైంది. నాగరాజు లెక్కలేనన్ని విలువైన రత్నాలు

అతనికి బహుమానంగా ఇచ్చాడు. తర్వాత నెమ్మది నెమ్మదిగా ఆ రత్నాలవర్తకుడి కుమార్తెను వివాహమాడాలనే తన కోరికను సూచించాడు.

ఇతనికన్న ఉత్తముడూ, ధనవంతుడూ అయిన వరుడు దొరకడం దుర్లభమని తలిచి, వర్తకుడు సంతోషంతో తన సమ్మతిని తెలిపాడు.

ఆ వర్తకుడి పుత్రిక యిదివరకే తమ మేడ కిటికీలోనించి ఆ యువకుణ్ణి చూచివుండడంచేతా, అతనిమీద మనస్సుపోయి వుండడంచేతా అతన్ని వివాహమాడటానికి మనసారా అంగీకరించింది. అతనినే పెండ్లిచేసుకుంటే రత్నాకరంలో మునిగి తేలవచ్చుకదా అని మురిసిపోయింది.

తర్వాత యథావిధిగా వారిద్దరికీ వివాహం జరిగింది. ఆ వివాహం జరిగేటప్పుడు నాగరాజు ప్రతిరోజూ కళ్ళు మిరిగి పోయే రత్నాలు గంపలకొద్దీ పెళ్లికూతురికి బహుమానం పంపుతూ వచ్చాడు. ఆమె ఆనందానికి మేరలేకపోయింది.

పెళ్లిరోజులు గడిచాక ఒకనాటి రాత్రి వర్తక యువకుడూ, అతని భార్యా ఏకాంతంగా వున్నప్పుడు, ఆమెను చూసి భర్త వికటంగా నవ్వాడు. ఆమె ఆశ్చర్యంతో అతనివేపు చూస్తూవుండగా, అతను నాలుక పొడుగ్గా చాచాడు. రాగా రాగా, ఆ రూపం అంతా క్రమంగా మారి, ఒక గొప్పపాముగా తయారయింది. అది చూసి భయంతో ఆమె పడకమీదనే మూర్ఛపోయింది.

మర్నాడు, ఎంత పొద్దెక్కినా కూతురూ, అల్లుడూ లేవలేదు. రత్నాల వర్తకుడూ, బంధువులూ వచ్చారు. ఎంత

తట్టినా తలుపు తీయలేదు. పగలకొట్టించి చూడగా వర్తకుడి కూతురు పడకమీద చచ్చిపడివుంది! ఆమె ఎడమ ముంజేతి మీద ఒక కాటు కనిపించింది. ఒక పెద్ద త్రాచుపాము పడక మీదినించి ప్రాకి, అక్కడనే ఒక కలుగులో దూరిపోవడం కూడా స్పష్టంగా కనబడింది.

రాజకుమారీ! ఇదీ కథ. తన దగ్గిర విలువైన రత్నాలెన్ని వున్నా—ఆ వర్తకుడి కూతురికి పాము తలమీది మణినే సంపాదించాలనే దుర్బుద్ధి ఎందుకు కలిగిందని నీవుద్దేశం?" అని పలికి ధీనిధి వూరుకున్నాడు.

చంద్రకళాదేవి యిలా సమాధానం యిచ్చింది: "ఆమెను ఆకర్షించింది ఆ పైకి ప్రకాశిస్తూవుండే మణిస్వరూపమే కాని దాని మహత్తు ఎంతమాత్రమూ కాదు. తనవద్దనుండే అనేకమైన మణులతోపాటు అపరూపమైన ఆ మణికూడా తనదగ్గర వుండాలనే కోరికే ఆమెకు ఆ బుద్ధి పుట్టించింది. ఏదైనా బుద్ధి పుట్టకనేపోవాలి కాని, పుట్టిందంటేమట్టుకు దాని నేవిధంగానైనా నెరవేర్చుకు తీరటమే స్త్రీలకు నైజం. కనుకనే, ఆమె పామును చంపి అయినా తన కోరిక నెరవేర్చుకోవటానికి సాహసించింది. ఇందులో మరొక రహస్యం యేమిటంటే—'దూరపు కొండలు నునుపు' అని అన్నట్టుగా దగ్గిరవున్నవాటిని తేలిగ్గా చూడడమూ, లేనివాటిని గొప్పవిగా భావించడమూ స్త్రీ జనానికి స్వభావం."

ఇలా చెప్పి, ఆమె రాజువేపు చూసి దీర్ఘంగా నిట్టూర్చి వెళ్లిపోతూ, రాజు మనస్సునుకూడా తనతో లాగుకొని పోయింది. రాజు శరీరంమాత్రమే మిత్రుడితోకూడా పోయి

బస చేరుకుంది.

బసకు వచ్చాక హేమప్రభుడు శశినిధితో "మిత్రుడా! నా సందేహం తీరిపోయింది. నా అపజయం ఇప్పుడిక నిశ్చయమైనట్లే తోస్తున్నది. ఆమె ప్రతిభను ఎదుర్కోవడం నాకు సాధ్యం కాదు. నేనేమో మోహాంధుడనై, ఆమె నిట్టూర్పు విడవగా, నామీద జాలిచేతనే అలా చేసిందని భ్రాంతిపడుతున్నాను. చూడబోతే, ఇక అయిదురోజులే గడువున్నది. ఇన్ని రోజులుగా నువ్వు ఆమెకు చిక్కుప్రశ్నలు వెయ్యకుండా కాలం వ్యర్థం చేసి, నన్ను ఇలా హింసిస్తూ వున్నందుకుగాను, అడవియేనుగు మెట్టతామరను నలిపివేసినట్లు, నిన్ను నామరూపాలు లేకుండా నలిపివెయ్యవలసిందే! అలా చేసే తీరతానుకూడా. అటుతర్వాత నేనూ ఇక్కడనే ప్రాయోపవేశం చేసి ప్రాణం విడుస్తాను. అయ్యో! దురాత్ముడైన ఆ చిత్రకారుడు యీ చిత్రం నాకెందుకు చూపించాలి? దీన్నిచూసి ఆశపడి నేను ఇక్కడికి ఎందుకురావాలి? ఈ చిత్రానికీ, చంద్రకళకూ పోలిక ఏమీ లేదని యిప్పుడుకదా తెలుస్తున్నది. ఏమంటే—ఆమె చాలా దయకలది. ఈ చిత్రమో, నన్ను దహించివేస్తున్నది. ఇకమీద ఈ పటంచూచి ప్రయోజనం లేదు!" అని అనుకొంటూ, ఆ చిత్రాన్నుంచి తన దృష్టిని బలవంతంగా మరల్చుకోను యత్నించటంతో నిద్రలేకుండానే రాత్రి వెళ్ళబుచ్చాడు.

# పన్నెండవ రాత్రి



హేమప్రభుడు మరునాడు పగటిపూట అతికష్టంమీద మిత్రుడి సాయంతో పూలతోటలో గడిపి, సాయంకాలానికల్లా రాజపుత్రి ఉండే ఉద్యానవనం చేరుకున్నాడు. మిత్రులిద్దరూ అక్కడికి వెళ్లేసరికే చంద్రకళాదేవి కపిలవర్ణంగల చీరనూ, తృణ మణులు కుట్టిన రవికనూ ధరించి, తగిన అలంకార, కిరీటాలతో శిలావేదికమీద కూర్చుని వుంది. ఆమె, రాత్రంతా నిద్రలేని తన కన్నులతో రాజును చూసింది. ఆదృష్టికి హేమప్రభుడు పరవశుడై తన శిలావేదికమీద కూలబడ్డాడు. సిదప ధీనిధి ముందుకు వచ్చి, ఆమె యెదుట నిలిచి, యిలా చెప్పడానికి ప్రారంభించాడు—

"నాగరాజపుత్రీ! పూర్వం ఒకదేశంలో ఒకరాజుండే వాడు. అతడు న్యాయంగా రాజ్యం పాలించడం అంటే ఏమిటో ఎరగడు. అతనికి అలవాటుకాని వ్యసనంలేదు. జనులకి అతన్ని చూస్తే కిట్టదు. 'ఇలా చెయ్యడంకూడ'దని ఎవరైనా చెప్తే, వారిని వెంటనే రాజ్యంనుండి తరిమివేసేవాడు. కాలం గడిచిన కొద్దీ అతడు మరీ క్షీణస్థితికి వచ్చేశాడు. అసంతృప్తి ఎక్కువైన కొద్దీ వ్యసనాలకు అతడు మరింతగా లొంగిపోయాడు.

ఒకప్పుడతడు వేటకని పరివారంతో అడవికి వెళ్లాడు. తమకంకొద్దీ అతడు తన నగరాన్ని విడిచి అడవిలో చాలా దూరం సాగిపోయాడు. అప్పటికి చీకటిపడ్డది. 'ఈ రాత్రికి

ఎక్కడ తలదాచుకోవడం ?' అని ఆలోచన కలిగింది. అలా అలా వెతుక్కుంటూ పోగా, ఒక పర్ణశాల కనబడింది. అందులో ఒక ముసలి ఋషి తపస్సు చేసుకుంటున్నాడు. రాజు తన పరివారాన్ని అడవిలో విడిచి, తానొక్కడూ ఆ పర్ణశాలలో ఉండిపోదామనుకొన్నాడు. ఆ తపస్వి రాజుకు కంద మూలఫలాదు లిచ్చి సత్కరించి, ఆ పర్ణశాలలో దర్భగడ్డితో పడక ఏర్పరిచాడు. పడుకున్నదే రాజుకు నిద్రపట్టేసింది. ఆ నిద్రలో ఒక కల వచ్చింది. ఆ స్వప్నంలో—

రాజు ఒక నదిఒడ్డున నిలబడి వున్నాడు. సూర్య కాంతి ఆ నదీజలాలమీద పడి మిలమిలకాంతులు కల్గిస్తూ వుంది. రాజు దట్టమైన చీకటిలోనించి బయటపడుతూ, మళ్లీ ఆ చీకట్లోకే పోతూవున్నాడు. రాజు చేతిలో ఒక విత్తనం వుంది. తాను నిలుచున్నచోట ఒక రంధ్రంచేసి, ఆ విత్తనాన్ని అందులో ఉంచి, మట్టి కప్పివేశాడు. ఆ నదిలోని నీళ్లు కొన్ని పోశాడు. అంతలోనే ఆ విత్తనం మొలకెత్తి పెద్ద వృక్షమైంది. అది అంతలోనే పుష్పించి ఫలించింది కూడాను. ఆ ఫలం ఒక్కటే ఒక్కటి! అది క్రమక్రమంగా పెరిగి పెద్దదయి, గుమ్మడికాయంత అయింది. అది మొదట ఆకుపచ్చగా వుండి, తర్వాత ఎర్రగా మారింది. అతిబరువువల్ల అది వున్న కొమ్మ చేతికి అందేటంత కిందికంటా వంగిపోయింది. చిత్రమైన ఆ పండును రాజు తెంపాడు, దాన్ని భుజించాడు.

అప్పుడు ఆ చీకట్లోనించి ఒక బ్రహ్మాండమైన చెయ్యి వచ్చి అతన్నిపట్టి బయటికి తీసి, శరీరం నిమిరింది. అతనికి ఒక సన్నటిదారం కట్టి ఉంది. ఆ దారాన్ని ఆ చెయ్యి పట్టు

కొని వుంది. కిందచూస్తే అగాధమైన పాతాళలోకం! మీదికి చూడగా, ఆ దారాన్ని ఒక గద్ద ముక్కుతో పొడుస్తూ తెంపి వేయడానికి సిద్ధంగా వుంది!

ఇవన్నీ చూచి, భయంచేత రాజుగుండె పిడచకట్టుకు పోయింది. త్వరలోనే రాజుకు తెలివి వచ్చింది. ఎదట, పర్ణ శాల పై కప్పులోంచి లోపలికి పడుతున్న చంద్రకాంతిలో చూడగా—ఆ ముసలి ఋషి నిలిచి, తనలో ఏమో స్మరిస్తూ తపస్సుచేస్తూ వుండడం కనబడింది.

రాజు మళ్లీ పడుకున్నాడు. ఈసారి మరో కలవచ్చింది. ఆ కలలో వెనకటిలాగే రాజు విత్తువేసి, నీళ్ళుపోయగా, అది పెరిగి పెద్దదయి మునపటిలాగే గుమ్మడికాయంత పండూ పండి, కిందికి వేలాడుతూ చేతికందింది. రాజు దాన్నికూడా తెంపి భుజిం చాడు. ఆతని మనస్సుకు బ్రహ్మానందం కలిగింది. అతనికి తర్వాత గాఢమైన నిద్రపట్టింది. పొద్దెక్కాక, ఆ తపస్వి లేపేవరకూ రాజుకు తెలివి రానేలేదు. తర్వాత రాజు ఇంటికి మరలి పోయాడు. అప్పటినుంచీ అతని పద్ధతులన్నీ మారిపోయాయి.

రాజకుమారీ! ఆ రాజు తన పద్ధతులను ఎందుకు మార్చు కున్నట్టు?" అని ధీనిధి ప్రశ్నించి ఊరుకున్నాడు.

చంద్రకళాదేవి ఇలా సమాధానం యిచ్చింది: "ఆ రాజు చేసుకొన్న పాపాలే ఆ వృక్షం! వాటిఫలం అనుభవించ డమే ఆ పండు తినడం! వాటివల్ల అతనికి ముందు లభించే మహా నరకమే ఆ పాతాళం. అందుచేతనే అతనికి చాలా భయం కలి గింది. అందుకనే కలవరపడ్డాడు. అతనికి కనబడింది అస్పష్టమైన తన ప్రతిచ్ఛాయ! అతని ప్రవర్తన మంచిగా మారినప్పుడు—

అత ననుభవించేది—రెండో కలలోని సంఘటన! అలాటి స్థితిలో అతను ప్రశాంతచిత్తుడై నిర్విచారంగా నిద్రపోవటంలో ఆశ్చర్యమేముంది?"

ఇలా చెప్పి రాజకుమారి, కళ్లంట నీళ్లు తెచ్చుకుంటూ రాజును చూసి, లేచి వెళ్లిపోయింది. రాజు మనస్సు ఆమెను వెంబడించింది. శరీరం శనిధితో పాటు బసకు చేరుకుంది.

బస చేరుకోగానే హేమప్రభుడు శనిధితో ఇలా అన్నాడు—"మిత్రుడా! కిందటి జన్మలో నేను చేసిన పాప కర్మల ఫలాన్ని ఇప్పుడు అనుభవిస్తూ ఉన్నాను. ఆ అనుభవానికి యింకా నాలుగురోజులే మిగిలివున్నాయి. నువ్వు కథలో చెప్పినట్లు నేనున్నూ అగాధమైన పాతాళంలో అడుగుపెట్టడానికే సిద్ధంగా వున్నాను. నాగుండె పిడచకట్టుకుపోవడానికి సిద్ధమయే వుంది. నువ్వెంతటి క్లిష్టసమస్యలు ఇచ్చినా—చంద్రకళ యుక్తి యుక్తంగా సునాయాసంగా జవాబివ్వడం చూడ అద్భుతంగా వుంది! ఇప్పుడామె చిత్రాన్నుంచి అమృతం చిలకటానికి బదులు విషమే నాపై ఆవరిస్తున్నది. తెల్లవారేలోపుగా నాస్థితి ఎలా వుంటుందో చెప్పలేకున్నాను" అని అంటూ హేమప్రభుడు నిరాశతో—ఆ చిత్రాన్నించి మొగం అటు త్రిప్పుకుని నిద్ర లేకుండానే రాత్రిని వేగించాడు.

---

# పదమూడవ రాత్రి



మామూలుగా రాజు మర్నాడు మిత్రుడితో పగలల్లా గడిపాడు. సాయంకాలమయేసరికి మిత్రులిద్దరూ రాజకుమారి ఉద్యానవనానికి వెళ్లారు. అప్పటికే చంద్రకళ లోహితవర్ణం గల చీర ధరించి, సముద్రమణులు కుట్టిన రవికె తొడిగి, వాటికి తగిన ఆభరణాలు, కిరీటమూ ధరించి, శిలావేదిక అధిష్ఠించివుంది. రాజును చూడగానే ఆమె వాడిపోయిన పుష్పంలాగ ముఖం వేలవేసికొంది. అప్పటి ఆమె సౌందర్యానికి ముగ్ధుడై రాజునోట మాటలేక తన శిలావేదికపై కూలబడ్డాడు—

అప్పుడు ధీనిధి ముందుకువచ్చి ఆమె యెదుట నిలిచి యిలా ప్రారంభించాడు.

'రాజపుత్రీ! ఒక ఊరిలో పరస్పరం అత్యంతంగా ప్రేమించుకుంటున్న దంపతులుండేవారు. జబ్బుచేసి పాపం, ఆ దంపతుల్లో భార్య చనిపోయింది. అప్పుడు భర్త చాలా దుఃఖిస్తూ 'ఓ యముడా! నువ్వు బలవంతుడివి! ఓ కాముడా! నువ్వంతకంటే బలవంతుడివి!' అన్నాడు.

ఆ మాటలు యముడు విని మన్మథుడితో 'చూశావా! వీడెలా అంటున్నాడో! ఈ బుద్ధిలేనివాడు నాకంటే నువ్వు ఎక్కువ బలవంతుడవని అంటున్నాడు!' అన్నాడు.

అందుకు మన్మథుడు 'వాడు సబబుగానే చెప్పాడు. అది అబద్ధంకాదు. నీకన్నా నేను బలవంతుడనే!' అన్నాడు.

తర్వాత వారిద్దరూ తమ బలాబలాలనుగూర్చి చాలా సేపు వాదించుకున్నారు. చివరికి మన్మథుడు 'మాటలెందుకూ? మన బలాబలాలు చూచుకునేందుకు పరీక్ష పెడదాం' అన్నాడు.

యముడు సమ్మతించాడు.

పరీక్షకుగాను వారు ఒక మఱ్ఱిచెట్టునూ, ఒక వీరుణ్ణీ, ఒక మునీశ్వరుడి హృదయాన్నీ లక్ష్యాలుగా నిర్ణయించుకున్నారు.

యముడు మొదట మఱ్ఱిచెట్టుదగ్గరికి పోయి దాని ఊడలు తాకి వాటిని నశింపజేశాడు. వెంటనే మదనుడు ఆ కొమ్మల్ని ఆవేశించి గబగబా క్రొత్త ఊడలు నాటుకొనజేసి, చెట్టును ఎంతో అందంగా తయారుచేశాడు. యముడు మళ్లీ మళ్లీ వాటిని నశింపజేసినా, మన్మథుడు మళ్లీ మళ్లీ వాటిని మొలిపించి, చెట్టు మునపటికన్నా బలంగా వుండేటట్లు చేస్తూవచ్చాడు.

యముడితో మన్మథుడు 'చూశావా, నా దెబ్బ! నేను నీకన్నా బలవంతుడ నవుదునా లేదా?' అని ప్రశ్నించాడు.

యముడు 'తొందరపడకోయి పిన్నవాడా!' అని అంటూ రణరంగంలో యుద్ధంచేస్తూవున్న వీరుడిదగ్గరకు పోయి, వానిని చంపివేశాడు. మన్మథుడు ఆ దేశప్రజలకి ప్రోత్సాహం కలిగించేడు. వారు, ఆ వీరుడి మరణానికి మిక్కిలి విచారించి, అతని స్మృతిచిహ్నంగా గొప్ప స్తంభాన్ని కట్టించారు. కవులు అతని యశస్సునుగూర్చి అమరకావ్యాలు రచించి వానికి శాశ్వతత్వం కల్గించారు. భక్తికొద్దీ తల్లులు తమ బిడ్డలకి ఆ వీరుని పేరే పెట్టేవారు. ప్రజ అతన్ని దేవునిగా ఆరాధించారు.

అప్పుడు మన్మథుడు యముణ్ణి చూసి 'ఇప్పుడూ నేనే

గెలిచాను. నీకంటె నేను బలంగలవాడనని ఒప్పుకుంటావా, లేదా?' అన్నాడు.

'తొందరపడకు. నిదానించిచూడు'అని చెప్పి యముడు, ఘోరంగా తపస్సుచేస్తూవున్న మునీశ్వరుడిలో దూరి హృదయాన్ని చంపివేశాడు. కాని మన్మథుడు ఆ మనస్సులో మళ్లీ కోరికలని పుట్టింపసాగినాడు. ఇలా అతని మనస్సు బాహ్య ప్రపంచానికి మృతప్రాయమవుతూ, మళ్లీ జీవంకలది అవుతూ, చివరకి బాహ్యసుఖాలకి లొంగిపోవడం తటస్థించింది.

అప్పుడు మన్మథుడు 'చూశావా యమరాజా! మళ్లీ నేనే జయించాను. నేనే బలవత్తముడనని అంగీకరిస్తావా, ఇప్పుడైనా?' అన్నాడు. అందుకు యముడు 'నే నొప్పను; నేనే నీకన్న బలవంతుణ్ణి. ఆ మృతిపొందిన ఆమె ప్రియుడు అబద్ధాలకోరు' అన్నాడు. ఆ మాటలు విని మన్మథుడు గట్టిగా నవ్వాడు. యముడు అతణ్ణి ఎగతాళిచేశాడు.

రాజకుమారీ! యిప్పుడు చెప్పు: యమ, మన్మథులలో ఎవరు ఎక్కువ బలంకలవారని నీ వుద్దేశం?" అని ధీనిధి ఊరుకున్నాడు.

చంద్రకళ వెలవెలపోయి హీనస్వరంతో యిలా అన్నది: "కామదేవుడు మాయలమారి. మోసంచేసే జూదగాడి వలె యముణ్ణి ఏమరిచి ఎలాగో ఒకలాగు జయించాడు. సమయాన్నిబట్టి అతనికి విజయం అనుకూలించవచ్చు. అంతమాత్రాన ఎల్లప్పుడూ అతడే జయిస్తాడని చెప్పలేము. సమయానుకూలంగా కొన్ని సందర్భాలలో తాను జయించగలననే ధైర్యం వుండబట్టే యముడితో పందెంవేశాడు. ఏమైనప్పటికీ,

నిజానికి యముడే మన్మథుడికన్నా బలవంతుడు. అతడు కాలానికి అతీతుడు. అతని శక్తి మార్పునకు ఎడమిచ్చేదికాదు. ఎప్పుడూ ఒక్క తీరుగానే వుంటుంది.''

ఇలా చెబుతూ, రాజకుమారి విచారప్పూర్కులతో రాజు వైపు చూస్తూ, లేచి వెళ్లిపోయింది. రాజు మనస్సు ఆమె వెంటనే వెళ్లింది. శరీరంమాత్రం మిత్రుడితో బసచేరుకుంది.

బసకు వచ్చాక ఛీనిధిని చూసి రాజు ''మిత్రుడా! ఇక నా జీవితానికి నీళ్లు వదలవలసిందే! ఇక మూడే మూడు రోజులు గడువు. అవీ వెనకటి రోజుల్లాగే గడిచిపోతాయని నా నమ్మకం. బెదరిన జింక చూచే చూపులతో, విచారయుక్తంగా, నా ప్రేయసి నామీద ప్రసరింపజేసిన చూపులవల్లనే నా భావి నిశ్చయమైపోయింది. అయ్యో! ఆమె ఇంతటి సౌందర్యవతీ, ఇంతటి జ్ఞానవతీ కాకుండావుంటే బతికిపోదునుకదా! ఆమెలో ఈ రెండు గుణాలూ అతీతంగా వుండటమే నా వినాశానికి కారణమౌతున్నాయి. అగ్నివలె నన్ను దహిస్తున్న యీ చిత్తరువు ఇక నాకెందుకు?''అని అంటూ చిత్రంవైపు చూడనన్నా చూడకుండా ఉన్మాదావస్థలో ఆ రాత్రి వెళ్లబుచ్చాడు.

---

# పదునాల్గవ రాత్రి



మరునాడు హేమప్రభుడు సగంప్రాణంతో వున్నట్లుగా కనబడి, మిత్రుడితోకూడా పగలల్లా తోటలో కాలంగడిపాడు. సాయంత్రం అయాక మిత్రులిద్దరూ రాజకుమారి ఉద్యానవనానికి వెళ్లారు. వీరు వెళ్లేసరికే చంద్రకళాదేవి బంగారుచీర ధరించి, వైడూర్యాలు కుట్టిన రవిక తొడుగుకొని, వాటికి తగిన ఆభరణాలూ, కిరీటమూ ధరించి ఉంది. ఆమె సంతోష, విచారాలను రెండిటినీ సూచించే చూపులతో రాజును చూసి, అతన్ని పరవశుని చేసింది. రాజు స్తబ్ధంగా శిలావేదికమీద కూలబడ్డాడు. తర్వాత ధీనిధి ముందుకు వచ్చి ఆమె యెదట నిలిచి యీ విధంగా ప్రారంభించాడు—

"రాజకుమారీ! ఒకవూళ్లో కృతాకృతుడనే ఒక బ్రాహ్మణుడు ఉండేవాడు. అతడు తన కులధర్మాలను పూర్తిగా విడిచి, చెడుదారిని తిరగసాగాడు. ఎప్పుడుచూచినా, జూదగాళ్ళతోటీ, తాగుబోతులతోటీ, పంచ మహాపాతకులతోటీ వానికి పొత్తు. క్షుద్రమంత్రాలు ఉపదేశంపొంది, అతను అర్ధరాత్రులందు శ్మశానాలలో నివసిస్తూ భూతభేతాళ పిశాచాలతో స్నేహం సంపాదించాడు.

ఒకనాటి రాత్రి ఒక భూతం చాలా ఆకలితో బాధపడుతూ యితడిని చూసి "ఆకలి దహిస్తున్నది. ఏదేనా మాంసం వెంటనే తీసుకురా. తీసుకురాకపోతే నిన్ను ముక్క-

ముక్కలుగా చీల్చివేస్తాను” అన్నది.

అందుకు ‘సరే నేను తీసుకువస్తాను; కాని వూరికే తీసుకురాను. దానికి నువ్వు ప్రతిఫలం ఏదన్నా ముట్టజెప్పాల్సి వుంటుంది’ అని అన్నాడు కృతాకృతుడు.

“అయితే, నువ్వు అప్పటికప్పుడు చంపిన బ్రాహ్మణుడి మాంసం తీసుకువచ్చి యిస్తే, చచ్చినవాళ్ళని లేచికూచోపెట్టే మంత్రం చెప్తాను” అంది భూతం.

‘ఆ ప్రతిఫలం సరిపోదు’ అని అన్నాడు కృతాకృతుడు. తర్వాత యిద్దరూ యీ విషయంలో చాలాసేపు వాదులాడు కున్నారు.

చివరకి కృతాకృతుడు “నే నెలా విసిరి పడేసినా ఆటలో నాకు గెలుపు కలిగించే పాచికలజత కూడా ఇస్తే నువ్వుకోరిన మాంసం తెచ్చియిస్తా” నన్నాడు.

దానికి భూతం వొప్పుకొంది. కృతాకృతుడు వూళ్ళోకి వచ్చి, మార్గాంతరం ఏదీ కనబడకపోవడంచేత తన సోదరుణ్ణే హత్యచేసి, ఆ మాసం భూతానికి అర్పించి, ప్రతిఫలంగా మృత కళేబరాన్ని బ్రతికించే మంత్రమూ, జోడుపాచికలూ తీసు కున్నాడు.

కొంచెంసేపయాక, కృతాకృతుడికి ఉబలాటం కలిగింది. తనకు భూతం చెప్పినమంత్రాల మహిమ యేమిటో, పాచి కల మహత్తు ఏమిటో పరీక్షిద్దామని బుద్ధిపుట్టి, ఎక్కడి నుంచో ఒక చండాలుడి పీనుగుని శ్మశానానికి తెచ్చి, ఒకచోట పడుకోబెట్టి తన్నునేర్చిన మంత్రం ఉచ్చరింపసాగాడు. సగం మంత్రం ఉచ్చరించి, అస్థిరచిత్తుడు కావడంచేత మంత్రం పూర్తి

కాకుండానే ఆ పీనుగువేపు చూశాడు. సగంమంత్రం పని చేయడంవల్ల దానికి సగంప్రాణమే వచ్చింది. అనగా—ఎడమ కన్నూ, ఎడమచేయీ, ఎడమకాలూ కదలజొచ్చినయి.

కుడి భాగానికి ఇంకా అప్పటికి ప్రాణం రాకపోవటాన్ని అది చలనంలేకుండా అలాగే వుండిపోయింది.

ఆ దృశ్యాన్ని చూడగానే బ్రాహ్మణుడికి భయం వేసింది. అతను బెంబేరుపడ్డాడు. ఆ గడబిడలో—అతడు తక్కిన సగంమంత్రమూ మరిచేపోయాడు. అటుతర్వాత భయపడి ఒక్క గెంతుగెంతి పరుగుచ్చుకొన్నాడు.

కాని ఆ శవంకూడా త్రుళ్ళిపడ్డది. ప్రాణం రాని దాని కుడిభాగంలో ఒక భూతం ప్రవేశించడంచేత, ఆ శవం లేచి బొబ్బరిస్తూ, అస్పష్టంగా 'అనధికకృత మకృతం' అంటూ కృతాకృతుడిని వెంబడించింది.

అప్పుడది ఒక్క ఎడమకాలినే కదిలిస్తూ ఎడమ కను గుడ్డు తిప్పుతూ వుంది.

కృతాకృతుడు భయంతో ఇంట్లోకి పోయి, పడకగదిలో దూరి తలుపులు వేసుకుని పడుకున్నాడు. నిద్రపట్టేసింది. కాని కొద్దిసేపట్లోనే 'అనధికకృత మకృతం' అనే భయంకరధ్వని అతనికి తెలివి తెప్పించింది.

కళ్ళు తెరిచిచూడగా ఎదట—భూతం ఆవేశించిన చండాలుని కళేబరం! తలుపులన్నీ తీసివున్నాయి. బ్రాహ్మణు డికి మీదిప్రాణాలు మీదికే ఎగిరిపోయాయి. పడకమీదినించి ఒక్క దుముకు దుమికి అతను మరోద్వారం మూలంగా అవతల పడి, చాలా దూరప్రదేశంలో వున్న మరోపట్టణం ప్రవే

శించాడు.

ఆ వూరు చేరి, అతడు 'బతుకు జీవుడా!' అనుకున్నాడు. ఆవూళ్ళో—అతడు తనకు భూతం యిచ్చిన పాచికలతో జూదం ఆడి, చాలా డబ్బు సంపాదించాడు. అక్కడ తాను సుఖిస్తూ, ఇతరులకి యింత పెడుతూ వారిని తృప్తిపరుస్తూ వుండేవాడు.

ఇలా జరుగుతూ వుండగా, ఒకనాడు అతడు జూద గాళ్ల మధ్యను పాచికలతో ఆడుతూవున్న సమయంలో చండా లుడి శవం అక్కడికి వచ్చింది. దాని కుడిభాగం కుళ్లి కంపు కొడుతూ వుంది. అది ఎడమ కనుగ్రుడ్డు తిప్పుతూ కోపంతో 'అనధికకృత మకృతం' అని బొబ్బరింప సాగింది.

కృతాకృతుడు భయంతో ఒక్కగెంతు గెంతి ఎదురుగా వున్న ద్వారంగుండా పరిగెత్తి ఆ వూరు విడిచి చాలాదూరం పోయి ఒక అడవిలో కొన్నిరోజులు తలదాచుకున్నాడు.

ఆ శవం మళ్లీ వస్తున్నదేమో అనే భయంతో బెదు రుతూ వెనక్కి చూస్తూ తర్వాత మరో పట్టణానికి పోయాడు. వెనక జూదగాళ్ళకూటంలో వున్న అంతమందీ ఈ సన్నివేశం చూసి భయపడి ప్రాణాలు విడిచారు.

ఆ కొత్త వూరికి చేరుకొన్నాక కృతాకృతుడు జూదం ఆడి మళ్లీ బోలెడంత ధనం సంపాదించాడు. అది పెట్టుకొని తా ననుభవిస్తూ, ఇతరులకి దానధర్మాలు చేస్తూ సుఖంగా ఉంటూవుండగా, మళ్లీ అక్కడికి ఈ చండాల శవం వచ్చి దాపరించింది.

దాని ఎడమ కన్నుగ్రుడ్డు తిరుగుతూ, ఎడమ కాలు

కదుల్తూ వుంది. కుడిభాగం కుళ్లి కంపుకొడుతూ, ఎముకలనుంచి మాంసం వేలాడుతూ వుంది. అది 'అనధికకృత ముకృతం' అని అరుస్తూ వచ్చింది.

అప్పుడు కృతాకృతుడు మేడమీది గదిలో వున్నాడు. ఆ స్వరూపాన్ని చూసి, అతను గదిలోని వీధివైపు ద్వారం నుంచి తప్పుకొని తలుపువేసి ముందు వసారాలో చేరుకున్నాడు. అయితే, ఆ శవం తలుపు తీసుకుని అతనివెంట పడింది.

వేరే దారిలేక కృతాకృతుడు ఆ వసారాలోంచి కిందికి గెంతవలసి వచ్చింది. అలా గెంతి ముక్కముక్కలయి వెంటనే అతడున్ను మరణించాడు.

రాజపుత్రీ! ఇప్పుడు చెప్పు—ఆ శవం పలికిన మాటల అర్థమేమిటో?" అని ధీనిధి ఊరుకున్నాడు.

చంద్రకళ ఇలా చెప్పింది: "ఇందులో పెద్ద సమస్యేమున్నది? ప్రారంభించిన పని పూర్తిచేసే ధైర్యంలేని శక్తిహీనులకి దుఃఖమే కలుగుతుందని దాని భావం. అలాటి వాళ్ళు, వాళ్ళు చెయ్యవలసింది చేయక, తక్కువగానన్నా చేస్తారు; లేదా ఎక్కువగానైనా చేస్తారు. దానివల్ల ప్రయోజనం లేదు. అపాయమూ కలుగుతుంది. సత్ప్రవర్తకులు ఎప్పుడూ, పాపం అణుమాత్రమూ అంటని పనులనే ధైర్యంతో ఆచరిస్తారు. దుష్టులకీ మంచివారికీ కూడా వారివారి చేష్టలకి తగిన ప్రతిఫలం తప్పక ముడుతూనే వుంటుంది.

సత్కార్యం ఏది చెయ్యడానికీ ధైర్యంచాలని పిరికిపందలు వాళ్ల బలహీనతవల్ల దెబ్బతింటారు; పాపంతో కూడిన వారి ప్రవృత్తివల్ల ఇహానికీ, పరానికీ కూడా చెడతారు."

ఇలా చెప్పి చంద్రకళ చూసీచూడనట్టుగా రాజును చూసి, వెళ్లిపోయింది. రాజు మనస్సు ఆమె వెంటబడింది. శరీరంమాత్రం మిత్రుడితోకూడా బసచేరుకుంది.

బసకు వచ్చాక రాజు ధీనిధితో యిలా అన్నాడు—

'మిత్రుడా! నల్లత్రాచుకాటు విషం తలకు ఎక్కినట్లు చంద్రకళ చక్కదనమనే విషం నా తలకు ఎక్కింది. అది యిప్పుడు బాగా పనిచేస్తున్నది. ఇంక రెండురోజులే నా జీవితపరిమాణం! నువ్వు అడిగిన యీ రోజు ప్రశ్నకు ఆమె యిచ్చిన సమాధానమే నాకు కలగబోయే ఫలితాన్ని సూచిస్తూ వుంది. ఆమె అలా సమాధానం చెప్తుందని నేను మొదటనే అనుకున్నాను. ఆమె బుద్ధి కత్తిదారులాంటిది. అది సమస్యలను తెగగొట్టడమే కాకుండా, నా మనస్సుమీదకూడా గట్టిదెబ్బ వేస్తూ వుంది.'

ఇలా అంటూ అతడు నిరాశతో—పడుకోకుండానే ఆ రాత్రంతా గడపినాడు.

——

# పదిహేనవ రాత్రి



హేమప్రభుడు ధీనిధి సహాయంతో మరునాడు సాయంత్రం దాకా అతికష్టంమీద గడిపి, మామూలుగా ఉద్యాన వనం చేరుకున్నాడు. అప్పటికే చంద్రకళాదేవి శిలావేదికమీద కూర్చునివుంది. ఆ దినం ఆమె తామ్రవర్ణంగల చీర ధరించి, చికిలీ చేసిన వెండితీగలతో కుట్టిన చక్కటి రవిక తొడుక్కొని వాటికి తగిన నగలూ, కిరీటమూ ధరించివుంది. రాజును చూసినప్పుడు ఆమె కళ్లు మెరిసాయి. ఆ కాంతిని చూసి అతడు దిగాలుపడి శిలావేదికపై కూలబడ్డాడు. ధీనిధి వెంటనే ముందుకు వచ్చి ఆమె యెదట నిలిచి యిలా ప్రారంభించాడు—

"రాజపుత్రీ! అప్పటిదాకా పెద్దల పోషణలో వుండి, గూడు కదలని ఒక చిన్న తేనెటీగకు సంచారం చెయ్యాలనీ, తన పెద్దలలాగే పూవుల మకరందం సంపాదించి, తేనె కూడబెట్టాలనీ బుద్ధిపుట్టింది.

అది బయల్దేరి వెళుతూ వుండగా, అడవిలో ఒక చిన్న మడుగునందు ఒక ఎర్రతామరపువ్వు వికసించివుండడం చూచింది. దాని పరిమళం తేనెటీగను ఆకర్షించింది.

కాని యిది వెళ్లేసరికి తామరపువ్వు ముడుచుకుపోయి, తేనెటీగను లోపలికి రానియ్యలేదు.

ఆ పువ్వు తేనెటీగతో "ఓ తేనెటీగా! నువ్వు దాచ బెట్టినట్లు నా మకరందాన్ని ఉచితంగా తీసుకునిపోవాలని అను

కుంటున్నావు. నీకది కావలిస్తే దానికి బదులు ఏదన్నా ఇచ్చి మరీ తీసుకో'' అన్నది.

తేనెటీగ 'నీకేం తక్కువ? నువ్విక్కడ వికసించి, చుట్టు పట్టులుకూడా అందంగా చేస్తున్నావు. నువ్వు పరిమళించి గాలికి కూడా సువాసన ఇస్తున్నావు గదా! నీకు నేనేం ఇవ్వగలను? ఐనా, నీకు కావాలిసిందేమిటి?' అన్నది.

అందుకు తామరపువ్వు 'ఓ తెలివితక్కువదానా! తేనె టీగవై ఉండీకూడా, నాకేంకావాలో తెలియకున్నదే నీకు! వెళ్లిపో! నాకేంకావాలో ఊహించి, తీసుకురా' అన్నది.

తేనెటీగ జుమ్ముమని ధ్వనిచేసుకొంటూ ఒక చెట్టు మొదట నేలమీద వున్న ఒక పేడపురుగువద్దకు పోయి 'తామర పువ్వునకు ఏమికావాలో చెప్పు'మంటూ అడిగింది.

'నేను చాలా పనితొందరలో వున్నాను; నీ తామర పువ్వూ గీమరపువ్వూ ఏం కోరితే నాకేమి?' అని అనేసింది ఆ పేడపురుగు.

తేనెటీగ నిరాశతో పోతూ పోతూ, ఒక సాలెపురుగు గూడు కట్టుకుంటూవుండగా చూసి 'ఓ సాలెపురుగా! తామర పువ్వు ఏం కోరుతున్నదో చెప్పూ' అంది.

అది తన గూడు అల్లుకుంటూనే 'వేరేంకావాలి? బహుశా దానికి ఆహారంగా ఈగ కావలసివుంటుంది' అంది.

తేనెటీగ మనసులో 'ఈ సాలెపురుగు తనకి యిష్టమైనదే అన్నిటికీ యిష్టమవుతుందని అనుకుంటున్నది. ఇంతకూ దీన్ని అడగడమే పొరపాటు' అనుకుని పోతూ పోతూ, ఒక మేఘాన్ని చూసి దానిని అడిగింది.

అది జవాబుగా 'వర్షపు చినుకులు' అని చెప్పింది.

తేనెటీగ వెంటనే పువ్వుదగ్గరికి పోయి, మడుగులోని నీటిబిందువులు కొన్ని తామరపువ్వుమీద రాల్చింది.

ఆ పువ్వు 'ఇవా నాక్కావలసింది ? నాకు వాననీళ్ళు కావలిస్తే మేఘమే యిస్తుంది, లేదా మడుగు యిస్తుంది. నువ్వు యివ్వనక్కర్లేదు' అన్నది.

తర్వాత తేనెటీగ 'దేవుడా !' అంటూ పోయి లేతగడ్డి చిగుళ్ళమీద ప్రకాశిస్తూవున్న సూర్యకిరణాన్ని చూసి 'తామర పువ్వు ఏం కోరుతూవున్నదో చెప్పు' అని అడిగింది.

దానికి 'వేడిమి కావలసివుంటుం'దని అది చెప్పగా, తేనెటీగ ఎగిరివెళ్లి ఒక మిణుగురు పురుగుని తెచ్చి పువ్వుదగ్గిర వుంచి, దానికి వేడి కలిగించడానికి యత్నించింది.

అది చూసి తామరపువ్వు 'ఓయీ ! నాకు వేడిమి కావలిస్తే సూర్యకిరణమే యిస్తుంది. నువ్వివ్వనక్కర్లేదు. పో ! మళ్ళీ ఆలోచించుకుని రా' అని అన్నది.

తేనెటీగ పోయి, ఒక చెట్టుకొమ్మమీద కునుకుతూ వున్న ఒక గుడ్లగూబ చెవిదగ్గిర చేరి 'ఓయి గుడ్లగూబా ! తామరపువ్వునకు ఏం కావలసివుంటుందో చెప్పూ !' అన్నది.

అది కళ్ళు మూసుకునే 'నిద్ర' అంది.

తేనెటీగ తామరపువ్వుదగ్గిరికి పోయి 'ఓ తామర పువ్వూ ! నేను జుమ్మని ధ్వనిచేస్తూ, జోకొడతాను. గాలి తగిలే టట్లు నా రెక్కలతో విసురుతాను, హాయిగా నిద్రపో !' అన్నది. 'నాకు నిద్ర కావలిస్తే రాత్రే యిస్తుంది, నువ్వు యివ్వ నక్కర్లేదు. వెళ్లి మళ్లీ యత్నించు' అన్నది పువ్వు.

తుమ్మెద నిరాశతో ఎగిరిపోయి అడవిలో తిరుగుతూ 'అయ్యో! చపలచిత్త, పిసినాకి అయిన యీ తామరపువ్వు ఏమి కావాలని అంటుందో కదా!' అని గట్టిగా అరుస్తూ, విచారించింది.

ఆ అడవిలో తపస్సు చేసుకుంటున్న ఒక మునికి దీని మాటలు వినబడ్డాయి. అతనికి అన్ని జంతువుల భాషలూ, పక్షుల భాషలూ తెలుసు. అతను తేనెటీగను దగ్గరకు పిలిచి 'ఓ మందబుద్ధీ! తామరపువ్వు కోరుతున్నది యిదీ' అంటూ, చెవిలో ఏమో చెప్పాడు. అతడు చెప్పిన తర్వాత తేనెటీగ సంతోషంతో పోయి, తామరపువ్వు కోరింది దానికిచ్చి, బదులుగా దానినుంచి మకరందం తీసుకుని వెళ్లిపోయింది.

రాజకుమారీ! ఇప్పుడు చెప్పు, తేనెటీగ తామరపువ్వు నకు ఏమిటిచ్చిందో!' అని ప్రశ్నించి వూరుకున్నాడు ధీనిధి. ఆమె సిగ్గుతో తలవంచుకుని, మెల్లగా 'ముద్దు' అని చెప్పి, రాజువైపు చూడకుండానే లేచి వెళ్లిపోయింది. రాజు మనస్సు మాత్రం ఆమెను విడువలేదు. తర్వాత మిత్రులిద్దరూ బసకు వచ్చేశారు.

బసకు వచ్చాక రాజు ధీనిధితో 'మిత్రుడా! ఇంక మనకి మిగిలివున్నది ఒక్కదినమే. ఈ రోజున ఆమె యిచ్చిన జవాబునకు నా రాజ్యమంతా యిచ్చినా—తగిన పారితోషికం కాబోదు! ఇలాటి జవాబు వచ్చినందువల్లనే నిన్ను నేను మన్నిస్తు న్నాను. ఆమె సమాధానం చెప్పేటప్పుడు నా హృదయం చీలి పోయిందనుకో! చంద్రకళకు నామీద ఉపేక్షాభావం - అనిష్టత లేదని ఊహించుకోవడానికి యిప్పుడుకదా కొంచెం ధైర్యం కలి

గింది. కాని రేపటిదాకా, విరహాన్ని ఎలా తాళుకోగలను? ఆమె చిత్రం నన్ను ఊరడించడానికి నిస్సారం అయిపోయింది. అది మొదట్లో చల్లదనాన్ని కలిగించినా, ఇప్పుడు హృదయతాపాన్ని కలిగించి, దాన్ని ఎక్కువ చేస్తూవున్నది' అని అంటూ, ఆ చిత్రాన్ని చూస్తూనే అతను నిద్రలేకుండా నిరుత్సాహంతో రాత్రి వెళ్ళబుచ్చాడు.

# పదహారవ రాత్రి



మరునాడు రాజు ఒంటరిగానే తోటలో తిరిగాడు. అతనికి అంతా అయోమయంగా వుంది. సాయంత్రం ఐపోతుందని భీతాహం ఒకవేపూ, సాయంత్రం అయితే తన ప్రియురాలు కనబడుతుందనే ఉత్సాహం ఒకవేపూ—ఇలా మనస్సు రెండు చీలికలై వివిధభావాలతో కలతపడుతూవుంది.

అతడు వినాయకుణ్ణి తలచుకొని 'ఓ గజాననా! మొదట నిన్ను పూజించే యీ ప్రయత్నానికి సిద్ధపడ్డాను. నువ్వు నన్ను మోసంచేశావు. నా దారిని అనుకూలపద్ధతికి తేకుండా, అడ్డు వేస్తూవున్నావు. చంద్రకళచేత చిక్కుప్రశ్నల కన్నిటికీ సమాధానా లిప్పిస్తున్నావు. ఇది ధర్మంకాదు' అని గణపతిని నిందించాడు.

తర్వాత కొంచెం యోచించి 'ఇది అధైర్యపడవలసిన సమయంకాదు. కృతాకృతుడిలాగ నా యత్నాన్ని మధ్యలో ఎంతమాత్రమూ విడిచివెయ్యకూడదు. రాజకుమారి సమాధానం చెప్పడానికి సాధ్యంకాని సమస్యను ఏదయినా నాఅంతట నేనే ఆలోచించాలి; అయితే—ధీనిధే కృతార్థుడు కాలేనప్పుడు నేనుమాత్రం కృతార్థుడనౌతానని నమ్మకమేమిటి? ఒకవేళ ఆమె సూక్ష్మబుద్ధిని తికమకలుపెట్టే ప్రశ్నలు వేయటం దేవుడివల్ల నవుతుందేమోగాని, మానవమాత్రుడికి సాధ్యమయేటట్టు కన బడడంలేదు' అని అనుకున్నాడు.

అటుతర్వాత హేమప్రభుడు సరస్వతీదేవిని తలచుకొని 'ఓ శారదాదేవి! నిన్నే శరణుచొచ్చాను. నువ్వే రక్షించాలి. నువ్వు దయవుంచి, నా ప్రియురాలికి తాత్కాలికంగా మనస్సు తబ్బిబ్బయేటట్లయినా చెయ్యాలి! లేదా ఆమె జవాబు చెప్ప లేని చిక్కుప్రశ్న నాకు తోచేటట్లయినా చెయ్యాలి. ఈ ఉప కారం చేసితీరాలి, జననీ!' అని మనసారా ప్రార్థించాడు.

సరస్వతీదేవికి రాజుమీద దయ కలిగింది. అతని మన స్సులో ఒక ఆలోచనను కలిగించింది. అది తోచగానే, రాజు సంతోషంతో ఒక్క గెంతు గెంతి "అమ్మయ్య! దేవికి అను గ్రహం కలిగింది. చంద్రకళ నాకు దక్కినట్టే" అని అనుకుని పరి గెత్తి ధీనిధిదగ్గరికి వెళ్లాడు.

అప్పుడు ధీనిధి - ఆ రోజున రాజకుమారిని అడగవలసిన ప్రశ్నను గురించే దీర్ఘంగా ఆలోచిస్తూ వున్నాడు. రాజు అతడిని చేరి 'మిత్రుడా! నీ ఆలోచన ఇక కట్టిపెట్టు. ఈ సాయంత్రం చంద్రకళకు నేనే సమస్య యిస్తాను' అన్నాడు.

అందుకు ధీనిధి 'చాలా సంతోషం! కాని మనం మొదటే సాధకబాధకాలు ఆలోచించుకుని అడగడం మంచిది. నువ్వు అడగదలచిన సమస్య ఏదో ముందు నాతో చెప్పు' అన్నాడు.

రాజు నవ్వి, 'నాకు నేనే ఒక సమస్యను. ఇదే ఆమెను అడిగి, ఈ విషయంలో నేనేమి చెయ్యాలో చెప్పాలి అంటాను. ఆమె సమాధానం యిస్తుందిగదా! ఆ సమాధానాన్నే రేపు ఒక సమస్యగా మార్చి ప్రశ్నిస్తాను. దానికి ఆమె మరి సమా ధానం చెప్పలేకపోతుంది. తప్పకుండా పిట్ట వలలో చిక్కుతుం

టుంది' అని సంతోషంతో సమాధానం యిచ్చాడు.

ధీనిధి ఇది విని 'మహారాజుకు జయం నిశ్చయం! ప్రేమకు గల శక్తి చాలా అద్భుతమైనది! శిలకుమోస్తరుగా - అది ఒకప్పుడు బుద్ధిని మొద్దుబార చేస్తుంది; ఒక్కొక్కప్పుడు సుతీక్ష్ణంగానూ చేస్తుంది. ఇదివరకు ఏమీ తోచకుండా నిన్ను అంధుణ్ణిగా చేసిన ఆ ప్రేమే, యిప్పుడు నీ కళ్ళను తెరిపించి, నీ బుద్ధికి మహత్తర శక్తిని కలిగించింది. ఇన్నాళ్లూ మన కాళ్ళ దగ్గర - ఎదట వుండీకూడా మనం గమనించని వస్తువుమీద యిప్పుడు హాఠాత్తుగా దృష్టిపడింది! నేనూ మొదటినుంచీ రాజకుమారి హావభావాలను గమనిస్తూనే వున్నాను. ఆమెకు కూడా నీమీద గాఢమైన ప్రేమ ఉన్నదని గ్రహించాను. అది రోజురోజుకూ వృద్ధి అవుతూవుండడమూ తెలుసుకున్నాను. ఆ రహస్యం నీకూ తెలుసును; ఆమెఅంతట ఆమే సంతోషంతో నీ వలలో పడుతుంది. నేను ప్రశ్నించేటప్పుడు ఆమె కఠినంగా ఉన్నా, నీ విషయంలో పుష్పంవలె ఇట్టె మెత్తబడిపోవచ్చు. ఏమంటే - ప్రేమ గలచోట అవలంబించే పద్ధతి వేరు. రాజా!- నీకు విజయం నిశ్చయం!' అన్నాడు ధీనిధి.

తర్వాత హేమప్రభుడు, ఎప్పుడు సాయంత్రం అవు తుందా? ఎప్పుడు చంద్రకళను చూస్తామా? అనే తహతహాతో వుండగా ఎలాగైతేనేమి సాయంత్రం అయింది.

అప్పుడు ధీనిధి రాజుతో 'మిత్రుడా! ఈ దినం నువ్వొ క్కడవే రాజకుమారిదగ్గరికి వెళ్ళాలి. నీ వెంట నేను రాను. నేటిదినం మాత్రం నేను దగ్గర వుండకుండా, దూరంగా వుంటేనే నీకు గొప్ప వుపకారమని నమ్ము. మిత్రుడు దూరంగా వున్న

ప్పుడే - దగ్గర వున్నప్పటికన్నా ఎక్కువ మైత్రి చూపి, ఎక్కువ ఉపకారంచేసిన ఘట్టాలు చాలా వున్నాయి. ఉదాహరణగా ఒక కథ చెప్తాను విను...' అన్నాడు.

అందుకు రాజు 'మిత్రమా! ఇది కథలు వినడానికి సమయంకాదు. ఈ దినం నువ్వు లేకుండా నేనొక్కడినే వెళ్లినా, ఒకవేళ సరస్వతీదేవి వినాయకదేవుడూ అనుగ్రహిస్తే, నాకు విజయం కలగవచ్చు. అయితే, అది నా విజయం కాదనీ, నీ విజయమే అనీ నేను భావిస్తాను. యిన్నాళ్ళవరకూ నేను చంద్ర కళను చూడకుండా వున్న సమయంలో - విరహానికి గురియై మరణించకుండా నువ్వు నన్ను రక్షించావు. నేను విజయశిఖరాన్ని అధిరోహించడానికి నీ కథలు నిచ్చెనమెట్లవలె మహోపకారం చేశాయి' అని ధీనిధిని ప్రశంసించాడు.

ఆ మాటలకు ధీనిధి నవ్వి 'ప్రభూ! సరే కానీ, నువ్వి ప్పుడు నా కథను వినకపోయినా, నేను కథచెప్పిన ఫలమూ, నువ్వు విన్న ఫలమూ లభించినట్లే తోస్తూవుంది నాకు. అన్నట్టు—రాజకుమారి నీకోసం ఎదురుచూస్తూ వుంటుంది. ఎదురుచూస్తూవుండడంవల్ల కోరిక వృద్ధి అవుతుంది. నువ్వు అదృష్టవంతుడివి! నీకు తప్పక జయం కలుగుతుంది. వెళ్లు వేగం' అని చెప్పి ప్రోత్సాహంచేస్తూ రాజును పంపివేశాడు.

# వలపు: గెలుపు



అప్పటికే ఆలస్యమయిందని హేమప్రభుడు బయల్దేరి చాలా వేగంగా ఉద్యానవనం చేరుకున్నాడు. మధ్యదారిలో అతని కుడిభుజం అదిరింది. ఆ శుభశకునానికి సంతోషిస్తూ లోపలికి పోయేసరికి చంద్రకళాదేవి కొలువుకూటంనుంచి ఉద్యానవనంవేపు వస్తూ కనబడ్డది.

ఆమె నాటిదినం నీలిరంగుచీర ధరించి, రంగురంగుల రవిక తొడుగుకొనివుంది. ఆ రవికకు ఒకరకం సూర్యకాంత మణులు కుట్టివున్నాయి. ఆ దుస్తులకు తగిన నగలూ, కిరీటమూ ఆమె ధరించి వుంది.

"ఇంకా హేమప్రభుడు రాలేదే, ఎందుచేతా?" అనే ఆత్రంతో, అతని రాకను తెలుసుకోవడానికి శిలావేదిక దిగి వస్తూవుండగా, అతడు ప్రత్యక్షమయాడు.

అతన్ని చూడగానే చంద్రకళ సిగ్గుతో తల వంచుకుని, వెనక్కి వెళ్లిపోయింది. రాజు ఆమెదగ్గిరికి వెళ్లి అభివందనం చేసి, "రాజకుమారీ! ఒకానొకప్పుడు ఒక రాజు వుండేవాడు. అతడు అందకత్తె అయిన ఒక రాజకుమారిని వివాహం చేసుకో దలిచాడు. ఐతే, తాను సమాధానం చెప్పలేని ఒక సమస్య అడిగిన తర్వాతనే—అతడిని పెళ్లిచేసుకోవడం సాధ్యమని, ఆమె ఒక నియమం ఏర్పరచింది. నువ్వు గొప్ప ప్రతిభ కలదానవు కాబట్టి—యిప్పుడు చెప్పు—ఆ రాజు, ఆ రాజకుమారిని

ఏం ప్రశ్న అడగాలిసివుంటుందో” అన్నాడు.

ఈ ప్రశ్న విన్నవెంటనే చంద్రకళ ఆశ్చర్యపడింది. చివాలున లేచింది. తన మెడనున్న మణిహారాన్ని తీసి, అతని మెడలో వేసింది. వేసి, ఇలా అన్నది :

“మీ రూపం యీ నా మణిహారంలో వేల సంఖ్యలో ప్రతిబింబించేది. ఆ ప్రతిబింబం నాకన్నులలోనూ, తన్మూలంగా హృదయంలోనూ ప్రతిబింబించేది. మీ ఛాయ తప్ప నాకు మరొకటి కనబడేదేకాదు.”

ఇలా చెప్పి ఆమె తల వంచుకొన్నది.

హేమప్రభుడు ఆమె చెవిలో “నువ్వు నా హృదయాన్ని దొంగిలించావు. దొంగసొత్తు వుంచుకోరాదు కదా! కనుక దాన్ని, నీరూపంలో నాకు తిరిగీ ఇచ్చివేయాలి” అన్నాడు.

ఇలా అని నవ్వుతూ ఆమెను దగ్గరగా తీసుకున్నాడు. అప్పుడు చంద్రకళ “ఏమిటీ! నేను మీకు దక్కుననే మీరు భయపడ్డారా?” అన్నది.

అందుకు హేమప్రభుడు ‘ప్రియా! నేను మృత్యువు నోట్లోంచి ఇప్పుడుకదా బయటపడ్డాను’ అన్నాడు.

ఆమె మెల్లిగా నవ్వుతూ ‘భయపడడానికి తగిన కారణం నాకు కనబడలేదు. ఒకవేళ నేను యీదినం మీప్రశ్నకు సమాధానం చెప్పినా, రేపు జవాబు చెప్పదలచుకోనేలేదు. మీరు ఏమీ అడక్కుండా, నా పేరుమాత్రమే అడిగినా— నేను జవాబు చెప్పదలచుకోలేదు. రేపటిదాకా అతికష్టంమీద కనిపెట్టుకొనివుండి—మీకోసం ఎదురుచూడాలనే నిశ్చయించు

కున్నాను' అన్నది.

ఈ మాటకు హేమప్రభుడు—'ఎంత మోసం చేశావు! నువ్వు యిదివరకే సమాధానం చెప్పకుండా వుండి, నన్ను ఆ విరహావస్థనుంచి తప్పించి వుండకూడదూ?' అన్నాడు.

ఆమె 'మీలాగ నేనూ విరహావస్థ పడుతూనే వున్నాను. జవాబు చెప్పకుండా నేను ఎందుకు వూరుకున్నానో లేదో— నాకే తెలియదు. అయినా ఒక్క సంగతి! విషంలోనే అమృతం ఉన్నది. ఎలా అంటే—తమ ప్రియులు తమ కోసం బాధపడుతూ వుండడంలోనూ, వారు తమదగ్గిరకు వస్తే తిరస్కరించడంలోనూ, సాధారణంగా వనితలు సంతోషాన్ని పొందుతారు. అది వారి స్వభావం' అని తన ఆంతర్యం వెల్లడించింది.

హేమప్రభుని ఆనందానికి మేరలేకపోయింది. ఆ క్షణ మందే వారిద్దరూ గాంధర్వపద్ధతిని వివాహం చేసుకున్నారు.

కొద్దిరోజులు వినోదంగా అక్కడ కాలంగడిపిన తరువాత హేమప్రభుడు తన రాణితోనూ, ధీనిధితోనూ, చంద్రకళాదేవి పరివారంతోనూ, వస్తువాహనాలతోనూ తన రాజధానికి బయలుదేరాడు.

రాజు తెల్లని గుర్రంమీదా, రాణి నల్లని గుర్రంమీదా స్వారిచేస్తూ వచ్చారు. ఆ రెండుగుర్రాలూ మూర్తీభవించిన రాత్రింబగళ్ళవలె అందరి హృదయాలనూ ఆకర్షించాయి. వింతవింతల ప్రకృతిదృశ్యాలను చూస్తూ వినోదంగా ప్రయాణం చేసి, శ్రమ తెలియకుండా కొద్దిరోజులకల్లా వారు రాజధాని చేరుకున్నారు.

విజయంపొందిన తమ ప్రభువు, రాణిని వెంటబెట్టుకు వస్తూన్న సమాచారం చారులవల్ల మంత్రులకు ముందుగానే తెలిసింది. వారు పట్టణాన్ని బాగా అలంకరింపజేసి, మహా వైభవంతో ఎదురేగి గొప్ప మర్యాదలతో నూతన దంపతులను నగరంలో ప్రవేశపెట్టారు. తమ ప్రభువునకు, అందంలో అతనిని మించిన యువతి రాణిగా లభించినందుకు ప్రజలు మేరలేని ఆనందం పొందారు.

మొదట స్త్రీలంటే కిట్టని హేమప్రభుడు చంద్రకళా దేవికి అనుకూలంగా మసులుకొంటూ సమస్త సౌఖ్యాలూ అనుభవించి, రాజ్యాన్ని రామరాజ్యంగా పరిపాలించాడు.





# జ య ప్ర సూ న ము లు

సంపాదకుడు :

శ్రీ ముద్దా విశ్వనాధము

Bulusu Venkataramanaiah.



Sanjeeva Reddy

విజయ-ఉగాది

1953

యానికేతనము: పబ్లిషర్స్: మదరాసు 7.



మానవలోకమునకు మహనీయ మార్గదర్శకుడు టాల్స్టాయ్. ఆయన కథలు అన్నియు ఆదర్శ ప్రాయములు, ప్రబోధకరములు. ప్రపంచ సాహిత్య వేత్తలలో ప్రఖ్యాతయశస్కుడైన టాల్స్టాయి కథలకు క్రింది గ్రంథములు చక్కని తెలుగు కూర్పులు.

తెలుగుసేత : ముద్దా విశ్వనాథము

## ఆత్మజ్యోతి:

'మానవసేవయే మాధవసేవ' యను మహావాక్యమును సార్థకము చేయు ఇరువుర యాత్రికుల చిత్ర కథనము. ఈ కథలో 'చిత్తము శివునిమీద, భక్తి చెప్పులమీద' అనెడి లోకోక్తిని అతిరమ్యముగ చిత్రించినాడు టాల్స్టాయ్.

## ప్రేమాంజలి:

ముక్తిమార్గము చూపిన మూడు నవ్వుల కథ. అమృతతుల్యమగు మహత్తర ప్రేమతత్వము ఈ కథలో అత్యంత మహిమాన్వితముగ రూపితమైనది.

## ప్రవాసి:

మాతృపూజాధ్యానతత్పరుడగు ఒక దేశభక్తుని సాహసోదంతము. అద్భుత సన్నివేశములు.

## తూలిక:

మనోహర నీతికథా సప్తకము. మధురములగు ఇందలి కథలను హృదయమొక భూమికయై, ఆనందాకాశమున నాందోళించు ననుట అతిశయోక్తి కాదు.

## చిత్రసీమ:

అహింసాధర్మ ప్రభావమును ప్రదర్శించెడి అపూర్వగాథ. ఆధ్యాత్మిక ప్రవక్తయగు టాల్స్టాయ్ సృష్టించిన ఈ కథలోని ఆదర్శము లనే గాంధిమహాత్ముడు వాస్తవిక జగత్తులో రూపొందజేసి, ప్రపంచమునకు వెలుగుజూపినాడు.

## శుభోదయము:

ఇందు-శుభోదయము, అస్తమయము, పిల్లలు నేర్పిన పాఠము- అను రమ్యములగు మూడు కథలు

కలవు. ఈ మూడు కథలును మానవ జీవితమునకు ఆవశ్యకమగు మూడు ముఖ్యమగు సందేశములను అందిచ్చు చున్నవి. పిల్లలకు నీతిదాయకములు, పెద్దలకు ఆనందదాయకములు.

## దివ్యవాణి:

మనోజ్ఞమైన కథలు, గాథలు. ఇందలి 'గ్రిసెల్డా' కథ ఒకగొప్ప పరమార్థమును ప్రబోధము చేయు చున్నది. వివేకానందస్వామి జీవితములోని అద్భుత ఘట్టములను చదివియే తీరవలయు. చివర, కవి జీవితముకూడ చేర్చబడినది.

కర్త: కూచి నరసింహము పంతులు, బి. ఏ.

## జన్మభూమి:

జన్మభూమి, శృంగభంగము, స్వతంత్రమే స్వర్గలోకము, సంసార నౌక, తోడిదొంగలు, వేదాంతి చిట్టెయ్య అను ఆరు నాటికల సంపుటి. ఆత్మజ్యోతి తరువాత ఇది జ్ఞానజ్యోతి యనుపించును.

రచన: ముద్దా విశ్వనాథము

## సిరువారా సాహసము:

మండ్లామండలములోని పతంఘర్ ప్రాంతపు జానపదగాథ. పౌరుషప్రధానమైన ఒక రాకుమారుని సాహసకృత్యములు—ఆదర్శ సన్నివేశములు — మానవ మనఃప్రవృత్తులను ప్రదర్శించెడి విచిత్ర సంఘటనలు. మూడురంగుల ముఖచిత్రము. రెండు రంగుల నిండు చిత్రాలు. ముచ్చటైన అచ్చు కూర్పు, ఎన్నో రేఖాచిత్రాలు. ఇటువంటి అద్భుతగాథ ఇంతకు పూర్వము తెలుగుభాషలో వెలువడియుండలేదు.

రచన: శ్రీహరి

## రామచిలుక:

ఇందు—1. కోరిన ఫలం, 2. కామేశ్వరి కొడుకు, 3. పొరపడిన ఘట్టాలు, 4. మనసులో మాట, 5. అతడు - మానవుడు, 6. విషానికి విషమే విరుగుడు, 7. రామచిలుక, అను నవరసభరితము లగు ఏడు కథలున్నవి. మనోహరమగు త్రివర్ణ ముఖచిత్రము. ప్రతి శీర్షికకు రేఖాచిత్రము.

రచన: శ్రీవత్స

## * అమరగాధలు—1. అలెగ్జాండరు *



రచన:

ఎం.ఎస్.శాస్త్రి, బి. ఎస్. సి. (ఫార్మసీ)

★

ఎవ్వారి దివ్యచరితములు మానవజీవితమును క్రమమార్గమునకు మలిచి, పరివర్తనము కలిగింప శక్తిగలవో అట్టి పవిత్రమూర్తుల చిత్రగాధలు. ఏ మహిమాన్వితుల చరిత్రలు చదువరి హృదయాంతరాళమున మెఱసి, వెలుగునిచ్చి, శాశ్వతముగ నచ్చుపడి ఉత్సుకతను పెంపొందించునో, అటువంటి సంతత స్మరణీయుల పరమార్థసాధకములగు చిత్రగాధలు. ఎన్నిసారులు విన్నను క్రొత్తగనె తోచుచుండెడి కల్యాణాత్మకమగు ఈ గాధలు తెలుగు సారస్వతమునకే క్రొత్తలు. ఈ శీర్షికలో తొలిదొల్త ప్రపంచవిజేత అగు అలెగ్జాండరు చక్రవర్తిని గురించిన అపూర్వగాధలు చిత్రితములయినవి.

## అభిప్రాయములు:

"There is an element of hero-worship inherent in every human being. The lives of great men, it is often said, do remind us that we could make our lives sublime. Whether that is always true or not, stories of heroes' lives seldom fail to elate the young heart. It is, therefore, a good idea to present interesting and inspiring anecdotes from the adventurous and extraordinary life of Alexander the Great, in easy readable Telugu for the benefit of children. The selection of themes shows considerable discrimination on the author's part and the thirty-four anecdotes are full of human interest and are at the same time eminently representative of the life and message of the hero of Macedon who became the conqueror of the world—or more accurately that part of it which was known to him. The booklet is quite suitable for non-detailed study by lower form students. It can also be read for information or even sheer entertainment by the general reader, young or old."

1—3—53 —*The Indian Express*

# * అమరగాథలు—1. అలెగ్జాండరు *

"అమరగాథలు, పేరే ముచ్చటగ ఉన్నది. అవును. మహనీయుల దివ్య చరితములు శాశ్వతములు. వానికి నాశమనునది లేదుగదా. అమర గాథలు అమరగాథలే. ఎమ్. ఎస్. శాస్త్రిగారు వ్రాసిన అమరగాథలు అను పుస్తకమును ఆమూలాగ్రముగా రెండు మూడు మారులు చదివితిని. ఎంతకాలమునుండియో ఏ పాఠ్యపుస్తకమునందు చదివినను అలెగ్జాండరు యవనదేశపు చక్రవర్తి అనియు, మహాపరాక్రమవంతుడనియు, హిందూదేశముపై దండెత్తివచ్చి పురుషోత్తముని ఓడించెననియుమాత్రమే చదివితిమి. కాని ఈ చిన్నిపుస్తకమునందు 35 శీర్షికలతో అలెగ్జాండరు జీవితమంతయు వివరింపబడినది. ఈ విషయములు చదివినప్పుడు అలెగ్జాండరు: కేవలము యుద్ధోన్మాదియైన రాజేగాదు, మాతృవిధేయుడు. గురుపూజాతత్పరుడు, మిత్రసత్కారధారేయుడు, సేవకులయందు వాత్సల్యము, శత్రువులయందు మిత్రత్వము, ప్రజలయందు ప్రేమము చూపు ఉదారహృదయుడు, వేదాంత జిజ్ఞాసగల జ్ఞాని, సమరతంత్ర మెరిగిన శూరుడు, రాచమర్యాద లెరిగిన దిట్ట. వేయి కల్పనా కథలు చదివినదానికంటె ఇట్టి మహనీయుని జీవితచరిత్ర మొక్కటి చదివినందువల్ల కలిగెడి ఫలితము అనంతము. పుస్తకము పెద్దది కాకపోయినను అలెగ్జాండరు జీవితసారమంతయు పిడిచి తేటతేర్చి పాత్రయందు పోసి అందించినట్లున్నది. పిన్నలు పెద్దలు ఎల్లరు చదువవలసిన పొత్తము.

గ్రాంథికమని కటువునుగాక వ్యావహారికమువలె పేలవముగాక ద్రాక్షాపాకమువంటి చక్కని శైలిలో వ్రాయబడిన ఈ పొత్తము నవలవలె చదువుట కింపుగొలుపుచున్నది.

పిన్నవయస్కురాలైన ఈ రచయిత ఇట్టి అమరగాథ లనేకము రచించి ఆంధ్రభాషామతల్లికి సరిక్రొత్త తొడవులు తొడుగుగాక యని ఆశించుచున్నాను.

బాపట్ల
20-1-53. } కనుపర్తి వరలక్ష్మమ్మ